30-4-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక : 18 విక్రయం : రూ. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట రామానాయుడు

7/5/1993

## కైకలూరు వాక్ ఓవర్ కాబోదు!

కైకలూరు ఉపఎన్నికలో ఈజీగా గెలవ వచ్చుననుకున్న తెలుగుదేశం అంచనాలు తల్లక్రిందులు చేస్తూ కాంగ్రెస్ అభ్యర్థి బలం పుంజుకుంటున్నాడు. బాపిరాజుకు టికెట్ ఇవ్వని అలకలు తమ పంట పండిస్తాయని పచ్చ చొక్కాల వారు పగటి కలలు కన్నారు. కాని బాపిరాజు తన అసంతృప్తిని మనసులోనే అణగ ద్రొక్కుకొని, కాంగ్రెస్ అభ్యర్థి విజయానికి పని చేస్తున్నాడు. దీనికి తగినట్లు అభ్యర్థి ఎంపిక లోనూ తెలుగుదేశం పొరపాటు చేసింది. కృష్ణా జిల్లాలో భాగమే అయినప్పటికీ కైకలూరులో కమ్మ కులస్థుల ప్రాధాన్యత లేదు. కమ్మ అభ్యర్థిని ఎంపిక చేయడంతో తెలుగు దేశం కష్టాలలో పడింది. బాపిరాజు క్యాండిడేట్ అయివుంటే కాంగ్రెస్‌కు ఇది ఈజీ సీటై వుండేది. ఇప్పుడు ఇద్దరికీ కష్టమే: ఇద్దరూ సమవుజ్జీలే; ఎవరికీ వాకోవర్ లేదు.

## బదిలీల్లో ఎదురుదెబ్బ

మూకుమ్మడిగా తలపెట్టిన బదిలీల వ్యవహారం ముఖ్యమంత్రికి ఎదురు తిరిగింది. ఐపిఎస్ అధికారులలో కొందరి బదిలీలు ఇటు పార్టీలో, అటు ప్రజలలో కూడా విమర్శలకు దారి తీసింది. ఆయా అధికారులతో ప్రత్యక్ష పరిచయం, వారి పనితీరుపై స్వంత అంచనా లేకుండా ఎవరో చెప్పింది విని మార్పులు తలపెట్టడం వల్ల వచ్చిన ఇబ్బంది ఇది. ఈ ఎదురు దెబ్బతో బదిలీల కార్యక్రమం తాత్కాలికంగా నిలిపారు ముఖ్యమంత్రి. రెండు మూడు రోజులలో ఐఎఎస్ అధికార్లతో దీన్ని పునఃప్రారంభిస్తారని చెప్తున్నారు. స్వంత కార్యదర్శి శ్రీ ఎస్వి ప్రసాద్‌తో సహా పలు కీలక స్థానాలలో వుంటివారికి చలనం రావచ్చు.

# మజ్జి అంటే ముఖం మొత్తేసింది!

మజ్జి తులసీదాస్ మరెంత మాత్రం పిసిసి పీఠాధిపతిగా వుండడానికి వీల్లేదన్న పట్టుదలకు వచ్చేశారు కాంగ్రెస్ వాదులు. ఆయనంటే అందరికీ ముఖం మొత్తేసింది. మొదట్లో ముఖ్యమంత్రి మాత్రం అసంతృప్తితో వుండేవారు. చాలా సందర్భాలలో పబ్లిక్‌గా ఆ విషయం బయటపెట్టారు కూడా! కాని సాహసించి ప్రధాని పివితో ఆ సంగతులు చెప్పలేక పోయారు. పార్టీలోని ఇతర వర్గాలేవీ మజ్జిని సీరియస్‌గా తీసుకోలేదు. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. వైఎస్ వర్గంతో పాటు పలువురు చిల్లర మల్లర నాయకులు సైతం మజ్జి అంటే మండి పడుతున్నారు. మొన్న జరిగిన కార్యవర్గ సమావేశంలో అందరూ విరుచుక పడ్డారు. శ్రీ అయ్యపు రెడ్డి, నరసిరెడ్డి, ద్రోణంరాజు సత్యనారాయణ వంటివారు ముఖాన్నే అడగాల్సిన మాటలన్నీ అడిగారు. సూరజ్‌కుండ్ ఎఐసిసి తీర్మానాలను అమలు పరచడంలో పిసిసి విఫలమైందని, పిసిసి ఆఫీసుకు జిల్లా సంఘాలకు మధ్య సమన్వయం లేదని, పిసిసి పనితీరు బాగోలేదని విమర్శించారు. ఈ సమావేశంలో సిఎం కూడా వున్నారు. కాని ఆయనేమి లోక్యం చేసుకోలేదు. కమ్మగా వింటుండిపోయారు. అధ్యక్షుడుగా తాను చేయదగిన పనుల్నీ చేస్తున్నానని, ఇంతకంటే ఎవరు చేయగల్గిందీ ఏమీ లేదని తులసీదాస్ సమాధానమివ్వజూపినప్పటికీ అదెవరూ విన్పించుకోలేదు.

ఇదిట్లా వుంటే పిసిసి అధ్యక్షుడి ఖమ్మం జిల్లా పర్యటన రసాభాస అయ్యింది. ఆయన ఎదురు గానే జలగం, సిద్దారెడ్డి వర్గాలు జట్లు జట్లు పట్టుకొని కొట్టుకున్నారు. హైదరాబాదుకు తిరిగిరాగానే ఎన్ఎస్‌యుఐ సమావేశంలో కుర్రకారు కార్యకర్తలు గాంధీ భవన్‌ను రణరంగంగా మార్చారు. వారిని అదుపుచేయడం ఆయన తరంకాలేదు. సంఘటన మరీ పరువు తీసేదిగా వుండడంతో నగర ఎన్ఎస్‌యుఐ శాఖను రద్దుచేసి పారేశారు.

ఒకటిన్నర సంవత్సరంలో ఎన్నికలు పెట్టుకొని ఇటువంటి పిసిసి అధ్యక్షుడి సారధ్యంలో పార్టీని నడిపితే భవిష్యత్ చీకటి మయమేనన్న భావన పార్టీ వర్గాలలో వ్యాప్తిస్తున్నది. అందువల్లే ఆయన్ను తొలగించాలని ఉద్యమం ప్రారంభించారు. కాని పదవినుంచి దిగడానికి మజ్జి ససేమిరా ఒప్పుకోవడంలేదు. తాను ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికైనవాడినని, రెండేళ్ల పదవిలోవుండి తీరుతానని ప్రకటనలిచ్చారాయన. మజ్జిని తొలగించి ఆస్థానంలో మదన్‌మోహన్‌ను నిలపాలని ముఖ్యమంత్రి ఆలోచన. మదన్‌మోహన్ వెనుకబడిన తరగతులకు చెందినవాడు; తెలంగాణా ప్రాంతీయుడు, పివికి సన్నిహితుడు. కాని ఆయనకు ఏదైనా గవర్నర్ పోస్టు ఇస్తే వెళ్లాలని వుందట. పివిని అదే అడిగినట్లున్నారు. ద్రోణంరాజు సత్యనారాయణ, మల్లురవిలు కూడా పిసిసి పెత్తనం కోసం ప్రయత్నిస్తున్నారు. ద్రోణం రాజు వైఎస్ వర్గీయుడు. ఆయన నియామకానికి పెద్ద ఎత్తున ప్రతిబంధకాలెదురయ్యే అవకాశం వుంది. ద్రోణం రాజును ఆ కుర్చీలో చూడడానికి చాలా మంది ఇష్టపడరు. ఇంతకీ ఈ

కొరవ 7 పేజీలో

**ఇంటికి పంపడానికి ఆలోచన - మదనమోహన్, మల్లురవిల ప్రయత్నం.**

# చెన్నాకు చెలగాటం- కోట్లకు ప్రాణ సంకటం!

డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గవర్నర్‌గా రాజస్థాన్‌లో వున్నా హైదరాబాదుకు వచ్చినప్పుడల్లా వార్తలకెక్కుతం అనవాయితీగా మారింది. ఇటీవల ఆయన హైదరాబాదుకు వచ్చినపుడు 'సారా నిషేధం పై చేసిన వ్యాఖ్యలు' ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టాయి. రాష్ట్రంలో సారా నిషేధం అమలు ఆచరణలో అసాధ్యమని డాక్టర్ సాబ్ అన్నారు. ఇరవై ఏళ్ల క్రితం కూడా సారా నిషేధించారని, అయితే ఆచరణలో ఆ నిషేధం ఘోరంగా విఫలమైందని ఆయన చెప్పారు. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం విధించిన నిషేధం కూడా నీరు కారి పోవడం తథ్యమని, ప్రభుత్వం సారా నిషేధాన్ని ఆచరణలో పెట్టలేదని చెన్నారెడ్డి చెప్పారు. సారా నిషేధం పట్ల ప్రజల్లో నిజంగా స్పందనే వుంటే సారాయి వ్యతిరేక ఉద్యమ నాయకురాలు సంధ్యకు పాణ్యంలో ఎక్కువ ఓట్లు వచ్చి వుండాలి కదా అని ఆయన వ్యాఖ్యానించారు. సారా నిషేధం విధించడం రాష్ట్ర ప్రభుత్వం ఘనకార్యంగా ప్రచారం చేసుకుంటున్న సమయంలో మర్రి వారి ప్రకటన ముఖ్యమంత్రిని ఇబ్బంది పాలు చేసింది.

సారా నిషేధాన్ని [illegible]ంగా అమలు చేసేందుకు ప్రభుత్వ[illegible] నక్సలైట్ల సాయం తీసుకోవాలని మన రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ చేసిన ప్రకటన పై మర్రి చెన్నారెడ్డి స్పందిస్తూ " నక్సలైట్ల సాయం తీసుకుంటే గుడ్డిలో మెల్ల లాగా సారా నిషేధాన్ని అమలు చేయవచ్చుని " ప్రభుత్వ సామర్థ్యాన్ని పరోక్షంగా ఎత్తిపొడిచారు. అలాగే నక్సలైట్ల విషయంలో తన

మా ప్రత్యేక విలేఖరి

విధానమే సరైందని తాను ఇప్పటికీ నమ్ముతున్నానని డాక్టర్ సాబ్ సమర్థించు కున్నారు. రాష్ట్ర ప్రభుత్వం నక్సలైట్లను ఉక్కు పాదంతో అణచి వేస్తాననడం వల్ల ఉపయోగ ముండదని, వారి పట్ల ఉదారంగా వ్యవహరించి, తగిన స్వేచ్ఛ కల్పించ గలిగితే నక్సలైట్లు సాధారణ జీవన స్రవంతిలో కలిసి పోతారని డాక్టర్ సాబ్ అభిప్రాయ పడటం కూడా రాష్ట్ర ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టింది.

* * *

తనను రాజస్థాన్ గవర్నర్ గిరి నుంచి తప్పించే పక్షంలో రాజీనామా చేసి తిరిగి రాష్ట్ర రాజకీయాల్లో క్రియాశీలక పాత్ర వహిస్తానని డాక్టర్ చెన్నారెడ్డి హెచ్చరించారట. రాజస్థాన్‌లో బిజెపి ప్రభుత్వాన్ని రద్దు చేసి రాష్ట్రపతి పాలన విధించటంతో చెన్నారెడ్డి మకుటంలేని మహారాజుగా వెలిగి పోతున్నారు. గవర్నర్‌గా ఆయన తీసుకుంటున్న నిర్ణయాలు అటు ప్రతిపక్షాలకు గానీ, ఇటు కాంగ్రెస్ వారికి గానీ నచ్చటం లేదు. తనను గనక మార్చే పక్షంలో రాజస్థాన్‌లో బిజెపి తిరిగి అధికారంలోకి రావడం తథ్యమని చెన్నారెడ్డి చేసిన ప్రకటన పట్ల కేంద్ర ప్రభుత్వం విస్తుపోయింది. రాజస్థాన్‌లో ఇప్పుడు చెన్నారెడ్డి గారికి వ్యతిరేకంగా ఉద్యమాలు కూడా ఊపందుకుంటున్నట్లు వార్తలొస్తున్నాయి. ఒక దశలో చెన్నారెడ్డిని ఒరిస్సా గవర్నర్‌గా పంపాలని ప్రధాన మంత్రి యోచన చేశారట. అయితే తాను రాజస్థాన్‌ను విడిచి వెళ్లే ప్రసక్తే లేదని, ఒక వేళ ఒరిస్సాకు బదిలీ చేస్తే రాజీనామా చేసి తిరిగి ఆంధ్ర ప్రదేశ్‌కు వెళ్లి క్రియాశీలక రాజకీయాల్లో పాల్గొంటానని చెన్నారెడ్డి ప్రధాన మంత్రికి సందేశం పంపారట. దానితో చెన్నా బదిలీ కాస్తా నిలిచి పోయిందని అంటున్నారు.

* * *

ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డితో డాక్టర్ రెడ్డి దోస్తీ అంతంత మాత్రంగానే వుంది. జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు కోట్ల వారు తరచూ చెన్నారెడ్డితో సంప్రదింపులు జరిపేవారు. అయితే ముఖ్యమంత్రి అయ్యాక కోట్ల వారు చెన్నారెడ్డితో కాస్తంత దూరంగానే వుంటున్నారు. కోట్లతో సంబంధాలు బెడిసి కొట్టలేదని రాష్ట్రంలో ఉపఎన్నికల తర్వాత జరిగే మంత్రి వర్గ విస్తరణలో చెన్నారెడ్డి కుమారుడు మర్రి శశిధర్ రెడ్డికి మంత్రి పదవి దక్కడం ఖాయమని చెన్నా వర్గీయు లంటున్నారు. కోట్ల సన్నిహిత వర్గాలు కూడా శశిధర్‌కు మంత్రి పదవి అవకాశాన్ని కాదనలేక పోతున్నాయి. చెన్నారెడ్డి తత్వం తెలిసిన కోట్ల వారు ఆయన తనయుడికి మంత్రి పదవి ఇవ్వడం తథ్యం.

## అభినందనలు

మూగజీవుల ఆశాజ్యోతి, మాజీ గ్రామోద్యోగ వ్యవస్థ నాయకులు, అహర్నిశము ఈ వ్యవస్థ గుర్తింపుకు ప్రభుత్వంతో పోరాడి, నామ మాత్రపు గుర్తింపులో మనగలుగుతున్న ఈ వ్యవస్థ ప్రతిష్టకు జీవం పోసి కాపాడుతున్న

**శ్రీ దేవళ్ల దశరథరామిరెడ్డి గారు**

మరల అధ్యక్షుడుగా ఎన్నికైన శుభ సందర్భంలో హృదయ పూర్వక అభినందనలు.

— ఈదూరి శ్రీహరినాయుడు
బూదనం



* సారా నిషేధం అమలు అసాధ్యమని చెప్పి ప్రభుత్వాన్ని సంకటంలో పెట్టాడు

* తన గవర్నర్ గిరిని తాకితే అసలుకే ఎసరు పెడతానని పివిని హెచ్చరించాడు

* ఈ గౌడవంతా ఎందుకని పుత్ర రత్నానికి మంత్రిత్వ మిచ్చి శాంతింప జూస్తున్నారు.

# పినాకిని తీరం

## గెలువబోయేది కాంగ్రెసే!

పై మాటలోని ధ్వనిని పాఠకులు గ్రహించ గలరనుకుంటాను. ప్రారంభం కాంగ్రెస్‌కు నిరుత్సాహ జనకంగా వుండింది; సర్దుబాట్లు, గ్రహపాట్లు, ఏర్పాట్లది ఒక దశ; నాయకుల సమీకరణ, బాధ్యతల విభజన, ప్రచార అంకురార్పణ మరొక దశ; నాయకులందరూ బృందాలు బృందాలుగా చీలి వూళ్ల మీద పడి ఇతర అభ్యర్థుల మీద దృష్టి, అభిమానం వున్నవారికి వాగ్దానాలు చేసిన వారికి ముందు బ్రేక్ వేసి, తర్వాత ఒత్తిళ్ల గిత్తుళ్లతో ప్రసన్నులను చేసుకోవడం, ఇంకో దశ; త్రిమూర్తుల (విజయ–రామ–నారసింహులు) పెద్ద కటౌట్లు, బ్యానర్లు, జండాలు, పోస్టర్లతో ముఖ్యమైన కేంద్రాలన్నిటిని నింపి వేయడం ఆఖరు దశ. ఈ దశలన్నీ దాటి ముట్టడి విజృంభించి ఆశలు చిగురించే దశకు చేరుకున్నది కాంగ్రెస్ అభ్యర్థి పరిస్థితి. ఆఖరుకు గెలువబోయేది కాంగ్రెసే అని విశ్వాసంతో అనగలిగిన వాతావరణం క్రమంగా నెలకొంటున్నది.

ప్రజలు వెనుక బడిన పాత వారు కాదని, తెలివి మీరి వున్నారని, మంచి చెడు విచక్షణా జ్ఞానాన్ని కలిగి వున్నారని, స్వేచ్ఛా మార్గావలంబులై వున్నారని, అభ్యర్థుల నోటి వెంట వెలువడే ప్రతి మాటకు భాష్యాన్ని తీయ గలిగి వున్నారనే విషయం పాత తరం పెద్దలకు తెలియదు. తాను శాసనసభ్యుడుగా ఎన్నికైనా తన ఇఫ్కో ఛైర్మన్ పదవికి ఢోకా లేదని కాంగ్రెస్ అభ్యర్థి పెళ్లకూరు యధాలాపంగా అన్న మాట ఎంత దూరం పోయిందంటే ఈయన గెల్చినా ఓడినా ఢిల్లీలో తిష్ట వేయబోతాడు, మాకు ఏ అవసరం కలిగినా దిక్కెవరు అని ప్రజలు బహిరంగంగానే భయ సందేహాలు వెలిబుచ్చడం వరకు పోయింది. ఇదొక్కటే కాదు – క్రియాశీల రాజకీయాల్లో తన ప్రవేశం వుండ బోదనే ధరోసాతో గత పదేళ్లుగా ఏదైనా సహాయాన్ని అర్థించి తన వద్దకు వచ్చిన తన అభిమానులు అనుచరులైన వారికి తాను రాజకీయా స్త్రసన్యాసం చేసినట్లు మాట్లాడడం వల్ల పెళ్లకూరుకు తన పాత అనుయాయుల నుండే యిప్పుడు ప్రతికూలత ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ఓటర్లకు హామీగా నిలబడ వలసి వచ్చింది – మీకు పెళ్లకూరుతో సంబంధం లేదు, అన్నిటికి నేనున్నాను, నన్నే మీ ప్రతినిధినను కోండి– అంటూ మాగుంట నమ్మబలక వలసి వచ్చింది. అంటే పేరుకు పెళ్లకూరే గాని, అసలు అభ్యర్థి మాగుంటే నన్నమాట! జిల్లా రాజకీయ రంగ ప్రవేశానికి, జిల్లా భవిష్యత్ రాజకీయ రూపానికి కోవూరులో నాంది ప్రస్తావన జరిగిందన్న మాట; ఇతరుల మీద పూర్తిగా ఆధార పడ వలసి వస్తుందని తెలిసీ చివరి క్షణంలో ఎన్నిక బరిలో దూకిన పెళ్లకూరు దీనికి ఆస్కారం కల్గించాడన్న మాట!

ఈనాడు కోవూరు నియోజక వర్గ కాంగ్రెస్ ప్రచార రంగం సర్వం మాగుంట మయమే. ఆయన నిర్విరామంగా, అవిశ్రాంతంగా 'సమ్మర్ స్ట్రోర్మ్' గానే శ్రమ పడి తిరగడమే కాదు, తన ముగమోటాన్ని పలుకుబడి యావత్తు వాడి విముఖులైన వారందరిని సుముఖులను చేసుకోవడమే కాదు; తన యంత్రాంగ మంతటిని నియోజక వర్గ వ్యాప్తంగా దింపి కంటా తన ఆధీనంలో పెట్టుకోవడం విశేషం. ప్రచారంలో పాల్గొంటున్న నియోజక వర్గంలోని నాయకులను గాని, నియోజక వర్గేతర నాయకులలో అధిక సంఖ్యాకులను గాని మాగుంట నడిపిస్తున్నాడే గాని, పెళ్లకూరు గాని మరొకరు గాని కాదు. ఆయన నిమత్త మాత్రుడై పోయాడు. ఆయనొక్కడే అని ఎందుకనాలి? కోవూరు కాంగ్రెస్ ఎలక్షన్ ఆఫీసులో అతి వినయుడైన చెన్నారెడ్డి పెంచలు రెడ్డి గారి వీరంగ వృత్తాంతం విన్న తర్వాత మరో విధంగా అనుకోలేము. సుబ్బరామ రెడ్డి గారు చేస్తున్న అనుపమానమైన సేవను, పడుతున్న శ్రమను ఇటువంటి స్వల్ప సంఘటనలు వెల్తి పరుస్తాయి. ఇదొక్కటే కాదు– దిన పత్రికల్లో వెలువడిన బొమ్మల్లో వేసి తీర వలసిన జనార్దన రెడ్డి చిత్రం మినహాయింపు – దురుద్దేశ్యంతో జరిగింది కాక పోవచ్చు – ఎటువంటి అభిప్రాయం కల్గిస్తుంది? ఎవరికి సహాయ కారి అవుతుంది? ఎన్నిక సమయంలో ఇటువంటి చిన్న విషయాలు దురభిప్రాయాలకు, దుష్ఫలితాలకు ఆస్కారం కల్గిస్తుంటాయి!

మాగుంట తదితరుల ప్రవేశంతో, ఎక్కడి కక్కడ పెరుగుతున్న ఒత్తిడితో స్థానిక ముఖ్యులలో పునరాలోచన కలిగింది, మార్పు వస్తున్నది. మనసును ఇతరంగా లగ్నం చేసిన వారిలో, ముందే ఇతర అభ్యర్థులకు వాగ్దానం చేసిన వారి ఈ మార్పు ఎంత శాతం వుంటుంది? దాని ప్రయోజనం కాంగ్రెస్‌కు ఎంత వరకు వుంటుంది? కోవూరు నియోజక వర్గం లోని ఒక మిత్రుడు వున్న సంగతి చెప్పాడు – తాను తన మనుషులందరికీ కాంగ్రెసేతర అభ్యర్థి కొకరికి వెయ్యమని చెప్పేశాడట; వారంతా ఆ జండా చేబూనారట; ఆలస్యంగా కాంగ్రెస్ వారి ముట్టడి వచ్చింది. మాగుంట వారి మాట త్రోసి వేయలేను ఇతర పార్టీకి వేయమన్న నోటితోనే కాంగ్రెస్‌కు వేయమని చెప్పవలసి వస్తున్నది– అని వాపోయాడతను. ఈ విధంగా గ్రామాలలోని ముఖ్యులు ఎందరో

కొంత 11 పేజీలో

# జమీన్‌రైతు

## పరిశీలించదగినవే!

ఎన్నికల చట్టంలో మార్పులను కోరుతూ ఎన్నికల సంఘం కేంద్రానికి సమర్పించిన ప్రతిపాదనలు పరిశీలించ దగినవి గానే వున్నాయి. నామినేషన్ల తర్వాత ఏ రాజకీయ పార్టీ అభ్యర్థి మరణించినా ఎన్నిక రద్దు చేయకుండా, ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయాలన్నది వీటిలో ప్రధాన ప్రతిపాదన. ఎన్నికల బరిలో వున్న అభ్యర్థి అనారోగ్యంతోనే, మరో అనూహిత కారణంతోనే మరణిస్తే, అతడి గౌరవ సూచకంగా ఎన్నిక రద్దు చేయాలని చట్టంలో నిర్దేశించబడి వుంది. స్వాతంత్ర్యం వచ్చిన మూడు దశాబ్దాల వరకు ఈ నిబంధన ఎన్నికల నిర్వహణకు ఆటంకం కాలేదు. ఇటీవల కాలంలో రాజకీయాలలో ప్రవేశించిన హింసాత్మక ధోరణుల ఫలితంగా ఈ నిబంధన కాస్త గూండాలు, తీవ్ర వాదులకు వర ప్రసాదినిగా మారింది. పంజాబ్‌లో ఎన్నికలకు అడ్డు పెట్టడానికి మిలిటెంట్లు ఎందరు ఇండిపెండెంట్లను కాల్చి చంపిందీ తెలిసిన సంగతే. రాజకీయ వాదులుకూడా తమ వర్గానికి అవకాశం రానప్పుడు, ఓడిపోయే ప్రమాదం కల్గినప్పుడు స్వతంత్ర అభ్యర్థులను హతమార్చి పోలింగు రద్దుచేయించేవారు. ఈ బీభత్సాన్ని నివారించడానికి గత సంవత్సరం చట్టంలో మార్పు తెచ్చి స్వతంత్ర అభ్యర్థులు చనిపోయినా ఎన్నిక ఆగకుండా చేశారు. అయితే చంప దల్చినప్పుడు, కిరాయి గూండాలకు రాజకీయ పార్టీల అభ్యర్థులైతే మాత్రం అడ్డేముంది? అందువల్లే వారి మరణాన్ని మినహాయించమని కోరుతున్నది ఎన్నికల సంఘం. మరణించిన తమ అభ్యర్థి స్థానంలో వేరొకరిని నియమించుకొనే లేదా స్వతంత్రులనుంచి ఒకర్ని దత్తత తీసుకొనే స్వేచ్ఛ పార్టీల కివ్వాలన్నది ఈ ప్రతిపాదన సారాంశం. ఇది మంచి సూచనే! అయితే పోలింగుకు రెండు వారాల ముందు మరణిస్తేనే ఈ ఏర్పాటని వారు ప్రతిపాదించారు. దీని వల్ల ప్రయోజనం లేదు. ఎన్నికల తుది ఘట్టంలో మరణించినా ఇదే ఏర్పాటుకు వీలు కల్పిస్తేనే దాని ఉద్దేశ్యం నెరవేరుతుంది. అంతగా అయితే ఆ పరిస్థితులలో కొత్త అభ్యర్థి ప్రచారం కోసం పోలింగును మరికొన్ని రోజులు వాయిదా వేయవచ్చు. పోలింగు, కౌంటింగు కేంద్రాలలో ఏజెంట్ల నియామకాన్ని నియంత్రించే అధికారం ఎన్నికల సంఘానికి వుండాలని; ఎన్నికలలో పెట్టేఖర్చుకు ఖచ్చితంగా లెక్కలు చూపించి, పరిమితికి మించినట్టు రుజువైతే కఠినంగా శిక్షించే వీలు కల్పించాలని; అభ్యర్థి తరఫున ఇతరులు పెట్టే ఖర్చునూ లెక్కలోకి తీసుకోవాలని ఎన్నికల సంఘం ప్రతిపాదించింది. ఇవన్నీ సమంజసమైన సూచనలే. కండబలం, ధనబలం కల్గినవారు ఎన్నికలను తమ స్వార్థ ప్రయోజనాల కనుగుణంగా మల్చుకునే దురదృష్టకర పరిస్థితి నుంచి ఎన్నికలను ఎంత త్వరగా తప్పిస్తే అంత త్వరగా ప్రజాస్వామ్యం ప్రమాదం నుంచి బయటపడుతుంది!

## టైగర్ల ఘాతుకం

రెండేళ్ల క్రితం భారత ప్రధాని శ్రీరాజీవ్ గాంధీని పాశవికంగా చంపిన రీతిలోనే ఇప్పుడు శ్రీలంక దేశాధ్యక్షుడు ప్రేమదాసను కిరాతకంగా, మానవ బాంబు ప్రయోగించి హతమార్చారు. రెండు సంఘటనలు జరిగిన తీరు ఒకటే కాబట్టి అనుమానం ఎల్‌టిటిఇ పైకే వెళ్తున్నది.

ఆధునిక ప్రపంచ చరిత్రలో తమిళ టైగర్ల వంటి కిరాతక హంతక ముఠా మరొకటి వుండదనడం నిజం. ప్రపంచంలో పలుచోట్ల రాజకీయాధికారం కోసం ఎన్నో టెర్రరిస్ట్ సంస్థలు విధ్వంసకాండకు పాల్పడుతున్నాయి. కాని, ఎల్‌టిటిఇ వలె మృత్యువ్యూహాలు పన్ని, పకడ్బందీగా అమలు చేసే వారు వేరొకరు లేరు.

ఇటువంటి నరహంతకుల గుంపును, పాశవిక ముఠాను ఎదుర్కొని నిలువగల్గే సమర్థత, శక్తి శ్రీలంక ప్రభుత్వానికి లేవు. ఆ విషయం గ్రహించలేక, పట్టుబట్టి భారత శాంతి సేనను వెనకు త్రిప్పి పంపి ప్రేమదాస పెద్ద పొరపాటు చేశాడు. ఆనాడు, మరికొంత కాలం భారత సైన్యాన్ని అనుమతించి వుంటే ఈపాటికి ఎల్‌టిటిఇ నాశనమై పోయి వుండేది. భారత ఉపఖండం హంతక ముఠా బారినుంచి రక్షింపబడి వుండేది. తన పొరపాటుకు తనే ఈ శిక్ష అనుభవించాడు ప్రేమదాస.

ఇప్పటికైనా మించిపోయింది లేదు. భారత, శ్రీలంక ప్రభుత్వాలు ఒక అవగాహనకు వచ్చి, సంయుక్తంగా ఎల్‌టిటిఇని అణచివేసేందుకు కృషి ప్రారంభించాలి. మద్రాసు నగరంలో జయలలిత ఇంటిపైన ఒక మైక్రోలైట్ విమానం అనుమానా స్పదంగా తిరగడం ఈ అవసరాన్ని మరింత దృఢంగా నొక్కి చెప్తున్నది. కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లమధ్య వున్న జయలలితను చంపడం మామూలు పద్ధతులలో వీలుకాక ఎల్‌టిటిఇ గగన తలం నుంచి దాడిచేయడానికి కుట్రపన్నిందంటే భారత దేశానికి వారెంత ప్రమాదకారులుగా తయారైనారో అర్థం చేసుకోవచ్చు. పంజాబ్ టెర్రరిస్టులను పాదాక్రాంతం చేసుకోగల్గిన భారత సైన్యానికి తమిళ టైగర్లు పెద్ద సమస్యకాబోరు.

# జమీన్‌రైతు

7-5-43

4 పేజీలు 0-1-6

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### వి.ఆర్. హై స్కూల్

సంస్కృతాన్ని తెనుగులో బోధించ వలసిన సంస్కృత పండితునికి బదులు

బ్రహ్మ = బ్రహ్మడు

దూతః = దూతడు

తృణాని = గడ్డిలను

అని సంస్కృతాన్ని సంస్కృతంలో పాఠాలు బోధించే తెనుగు రాని అరవ సంస్కృత పండితుడు తాతా వార్యుల వారిని నియమించారు. వైష్ణవాభిమానంతో వైకుంఠ వాసులు మాతభూషివారు ఎట్లో ఆ ఉద్యోగ ఆయుర్దాయం ఆగస్టులో సమాప్తి కానుండగా, ఉభయ రావు శ్రీ విరాజితులు వవ్వేటి వారు వీరికి మరొక సంవత్సరం ఆయుర్దాయం పొయ్యాలని చూస్తూ మీటింగులో పెట్టడానికి దొమ్మలు లేక సర్క్యులేషన్ ద్వారా ప్రచారం జేస్తున్నారట. ఏమిటా యీ వైష్ణవాభిమానం అంటే? యిది ప్రిన్సిపాల్ అయ్యంగార్ సిఫార్సుగా ఉంటుందని ఊహ. బహుశా వవ్వేటి వారి అగ్రికల్చరల్ అల్లుడు వృక్షశాస్త్రజ్ఞుడుగా కాలేజీకి రావలసి వస్తే, ఫిలాసఫి వారు యింగ్లీషు చెప్పంగా, అగ్రికల్చరల్ వారు, బాటని చెప్పొచ్చుననే కన్వెన్షన్ ప్రకారం ప్రిన్సిపాల్ సహార్దు వుంటుందనే పరస్పర సహాయ కాంక్ష ఈ సంస్కృతుని పొడిగింపుకు కారణంగా వుంటుంది.

ఓ కమిటీ వారూ! సింహపురి గొడ్డు పోలేదు. సంస్కృతాన్ని తెనుగులో బోధించ గలిగిన ఉభయ భాషా పండితు లెందరో వున్నారు.

కాబట్టి తాతా గారికి నమస్కారంతో ఉద్వాసన చెప్పి సంస్కృత తెనుగు పండితుణ్ణి నియమించమని మా సలహా.

### తప్పు లెక్కలు

98 వేల టన్నుల బియ్యం మిగులు ఉంటుందని లెక్కవేశారు. ధాన్యం కొనుగోలు అధికారి 3 మాసాల నుండి నిగిడి కొనుగోలు జేసిన ధాన్యం 5 వేల టన్నుల యిక బజారులో సరుకులేదు. ఉన్న ధాన్యపు రాసులంతా రహస్యంగా పరాయి భూములకు దాటి పోయి నట్లున్నది. తప్పు లెక్కలతో కొంప ముంచి రైతుల వద్దనున్న ఆ వున్న కాస్త ధాన్యం గూడా ఎగుమతి జేసి ఆ ఖర్చున తిండికి కూడా చంపతారేమో నాయనా జాగ్రత్త!!

### ఈతగింజల ఎగుమతి

చిట్టి యీత గింజలు కోదూరు నుండి 150 బస్తాల దాకా గుంటూరు ఎగుమతి అయినవి. ఇవి ఫస్టు క్లాసు పీబరీ కాఫీగింజలతో స్నేహం సంపాయించి వీశ నాలుగున్నర అమ్మబోతున్నవి. భేషు! పెద్దల పొంగత్వం వృథా పోతుందా?

### మిరపకాయల యెగుమతి

పుదుక్కోట, బంగనపల్లె, పాండుచ్చేరి, కారైకల్, మాహీ, యానాం, మున్నగు చోట్లకు తప్ప మరెచ్చటికి ప్రభుత్వ అనుమతి లేనిదే మిరపకాయలు యెగుమతి చేయరాదని ప్రభుత్వం ప్రకటించింది.

### చింతచెట్లు నరకకూడదు

చింత పండు లభ్యం తగ్గిపోతున్నందున బొగ్గులు, వర్తకులు చింత చెట్లు నరకకూడదని ప్రభుత్వం శాసించింది.

### పెసలు – మినుములు

పెసలు, మినుములు మొదలగు పప్పు పదార్థాలు లోటుగా వున్నందున ఇతర రాష్ట్రాల నుండి తెప్పించే ఆలోచనలో వుందట ప్రభుత్వం.

### బొంబాయి రేషనింగ్

బొంబాయిలో 2 తేది నుండి ఆహార పదార్థాల రేషనింగ్ ప్రారంభమైంది. ఒక దఫా వారానికి సరిపడ్డ పదార్థాలు యిస్తారు.

భోపాల్‌లో గూడా 1 తేది నుండి రేషనింగ్ ప్రారంభమైంది.

– విమర్శకుడు

కొరవ 8 పేజీలో

# ప్రేక్షకుడి ఆలోచనలకు "గాయం"!

పాతికేళ్ల నాడు తెలుగు సినిమాల్లోని హీరోకు కొన్ని వుత్తమ లక్షణాలు వుండేవి. ఒక సంస్కర్త, కవి, రైతు, స్వాప్నికుడు, శ్రేయోభిలాషి, ప్రేమ పిపాసిగా కనపడి ప్రేక్షకులకు కొన్ని విలువలను నేర్పేవాడు. ఆ రోజుల్లోని నిర్మాతలు, దర్శకులు మంచి ఆలోచనలు కల్గిన వారు కావడంతో పరభాషా చిత్రాలతో పోలిస్తే తెలుగు చిత్రాలు ఆదర్శంగా నిలిచేవి. కాలక్రమేణా అన్ని రంగాల్లో వచ్చిన దిగజారుడుతనం తెలుగు సినిమానూ కమ్మి వేసింది. నేటి హీరో ఒక బజారు రౌడీ, గూండా, హంతకుడు, పచ్చి వ్యభిచారి, తాగుబోతు, బూతు భాషా కోవిదుడుగా సకల అవలక్షణాలతో కనపడుతున్నాడు.

ఇటీవల విడుదలయిన 'గాయం' సినిమా కూడా ఆ అవలక్షణ గుణాలు సలక్షణంగా గల సినిమా. చిత్రం హింసామార్గాన్ని మరింత పటిష్టం చేసింది. ఇప్పటికే తీవ్రమై పోయిన హింసా ధోరణికి ప్రభుత్వాలు, మేధావులు, గడగడ లాడి పోతున్నారు. ఇటువంటి సినిమాలు సంఘ వ్యతిరేక కార్యక్రమాలకు తప్ప, సమాజ శ్రేయస్సుకు ఏ మాత్రం వుపకరించవు. ప్రతి సన్నివేశంలో కనపడే హత్యలు, దావులు, గుట్టలు గుట్టలుగా పడివుండే శవాలు, కరుకు, కసాయి తనం గల కఠినాత్ములకు తప్ప మామూలు ప్రేక్షకుని ఆలోచనలకు తిరుగులేని గాయం చేస్తుంది. ఇటువంటి సినిమాలకు సెన్సార్ బోర్డు యథేచ్ఛగా సర్టిఫికెట్ ఇవ్వడం బాగోలేదు.

నెల్లూరు – రాజన్ కెపస్వీ

## జనవాణి

### నేటి సమాజానికి దర్పణం గాయం

సమాజానికి 'గాయం' అయ్యి చాలా దినాలయ్యింది. ఆ గాయాన్ని మాన్పే ప్రయత్నం ఎవ్వరూ చేయడం లేదు. ఎవరికి వారు మనకెందుకు అనుకోవడం వల్ల సమాజం అధోగతి పాలై పోతున్నది. ఈ విషయాయాలను ఇటీవల విడుదలైన రాంగోపాల్ వర్మ 'గాయం' చిత్రంలో చక్కగా చూపారు. సినిమాలో నటీనటులు, సాంకేతిక నిపుణుల గొప్పతనం పరిశీలించక వాస్తవ పరిస్థితులకు దర్పణంగా నిలచిన విషయాలు సినిమా చూస్తే అర్థమై పోతాయి.

చెర్లోపాళెం – ఎ. నిరంజన్

### నిరుద్యోగుల పట్ల జైళ్ల శాఖ నిర్లక్ష్యం

రాష్ట్రంలోని కడప సెంట్రల్ జైలు పరిధిలో గల కడప, కర్నూలు, నెల్లూరు, అనంతపురం, చిత్తూరు, ప్రకాశం జిల్లాలలోని జైళ్లలో ఖాళీగా వున్న 150

కొరవ 8 పేజీలో

# కోవూరు అసెంబ్లీ నియోజకవర్గ ఓటరు మహాశయులకు విజ్ఞప్తి

## ఇది నా స్వంత ఎన్నికగా భావించండి – మీకు సేవ చేసే అవకాశం కల్పించండి!

ఈ నెల 19 వ తేది జరుగనున్న కోవూరు శాసనసభా నియోజక వర్గం ఉపఎన్నికలో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారిని ఆదరించి, అభిమానించి, అఖండ విజయం చేకూర్చ వలసిందిగా కోవూరు ఓటర్లందరికీ సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

దేశం ప్రస్తుతమున్న క్లిష్ట పరిస్థితులలో అత్యంత నేర్పుగా, సాహసంగా, చతురంగా తన అనుభవ సారాన్ని రంగరించి సమర్థవంతమైన పరిపాలన అందిస్తున్న మన ప్రధాని, కాంగ్రెస్ నేత శ్రీ పి.వి. నరసింహా రావు గారికి ప్రతి భారత పౌరుడు తన సంపూర్ణ సహాయ సహకారాలను అందించ వలసిన సమయమిది. దేశాన్ని ప్రస్తుత సంక్షోభం నుంచి ప్రధానిగా శ్రీపి.వి. నరసింహా రావు గారు, పార్టీగా కాంగ్రెస్ మినహా మరెవ్వరూ గట్టెక్కించ లేరన్నది అందరికీ తెలిసిన సత్యం. దేశభక్తి ప్రపూరితుడైన ప్రతి భారతీయుడూ ఈ విషమ సమయంలో కాంగ్రెస్‌కు అండగా నిలవాలి, కాంగ్రెస్ అభ్యర్థులను గెలిపించడం ద్వారా తమ దేశ భక్తిని చాటి చెప్పాలి.

ఈ విశాల జాతీయ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనే నేను కోవూరు ఎన్నికలో ప్రత్యక్షంగా పాలు పంచుకుంటున్నాను. శ్రీ పెళ్లకూరు రామ చంద్రారెడ్డి గారిని గెలిపించే బాధ్యత తీసుకోవాలని ప్రధాని నన్ను ఆదేశించినపుడు సంతోషంగా ఆ బాధ్యతను స్వీకరించాను. శ్రీ రామచంద్రా రెడ్డి గారు స్వయానా ప్రధాని అభ్యర్థి అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. పై పెచ్చు ఆయనకు ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారి ఆశీసులున్నాయి. మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి అండదండలు లభిస్తున్నాయి. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఆనం సంజీవ రెడ్డి గారు జిల్లాలోని ప్రతి కాంగ్రెస్ నాయకుడూ ఆయన విజయం కోసం శ్రమిస్తున్నారు.

గత రెండేళ్లగా ఒంగోలు పార్లమెంటు సభ్యుడిగా ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని నా నియోజక వర్గ పరిధిలో నేను ప్రజలకెంతో చేరువగా మసులుతూ వారి అభివృద్ధి కోసం ఎంతో కృషి చేస్తున్న సంగతి మీకు తెలిసిందే. ఈ ఎన్నిక ద్వారా కోవూరు ప్రజలకు సన్నిహితుడై నా సేవలు అందించాలనే సంకల్పంతోనే నేనీ బాధ్యత స్వీకరించాను. ప్రతి గ్రామం సందర్శించి, ప్రతి ఓటరునూ స్వయంగా కలుసుకొని సహాయ సహకారాలు అభ్యర్థించటానికి నేను ప్రయత్నిస్తున్నాను.

శ్రీ రామచంద్రా రెడ్డి గారి గెలుపు నా స్వంత గెలుపుగా భావించమని, నా సేవలు మీకు అందించే అవకాశం కల్పించమని సవినయంగా మనవి చేస్తున్నాను.

సదా మీ సేవలో

– మాగుంట సుబ్బరామ రెడ్డి





శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి
ఒంగోలు పార్లమెంటు సభ్యులు

# మాగుంట గ్లామర్, శీనయ్య సానుభూతుల మధ్యే పోటీ

కోవూరు ఎన్నిక ప్రచారాన్ని విశ్లేషించి, ఫలితాన్ని ఊహించడ గిట్టని వారెవరైనా వుంటే 'జ్యోతిష్య శాస్త్ర' చదువు చెప్పి సత్కరించ వచ్చునిపిస్తుంది. మానవ మాత్రులకు, మామూలు విశ్లేషణకు

**"ఓట్ల లెక్కలు పరిశీలిస్తే కాంగ్రెసే గెలవాలి"**

అంతుబట్టే పరిస్థితిలో లేదది. ఎన్నికలలో పోటాపోటీలు, ఫోటో ఫినిష్ పరిస్థితులు వుండడం సహజమే కాని, కోవూరు ఉపఎన్నిక వలె పోలిక దొరకని వాతావరణం చాలా అరుదుగా తప్ప ఏర్పడదు.

ప్రచారం ఉధృతంగా వుంది; అభ్యర్థులు రోళ్లు పగిలే ఎండనూ వెన్నెల్లాగా భావించి తిరుగుతున్నారు. ఎత్తిన చేయి దించకుండా వంగి వంగి దండాలు పెడుతున్నారు. జెండాలు, బ్యానర్లు, కటౌట్లతో వూర్లు కళకళలాడుతున్నాయి; మైకుల గోలతో చెవులు గింగురు మంటున్నాయి; ఆడా, మగా విడివిడిగా, గడప గడప ఎక్కి ప్రాధేయ పడుతున్నారు; బొట్టు పెట్టి మరీ బ్రతిమలాడుతున్నారు. గ్రామ నాయకులున్న వార్ని అన్ని పార్టీల వారూ తలా ఒక దిక్కుకు లాగుతున్నారు. ఎండ వేడిమి 110 డిగ్రీలు కాస్తుంటే, ఎన్నికల వేడి 120 డిగ్రీలలో మసలుతున్నది. అయినా ఓటరు నుంచి ప్రతిస్పందన లేదు; ఉలుకుపలుకు లేదు; గుంభనంగా, గుట్టుగా, బెట్టుగా ఏదీ గోచరం కాకుండా గడిపేస్తున్నారు ఓటర్లు. వీరు వస్తే సరే - వారు వచ్చినా సరే - మూడవ వారు వచ్చినా సరే!- "అక్బిసార్, మాకు కాకుంటే మరెవరికి సార్, గెలుపు మాదే సార్" - ఇవే డైలాగులు. ప్రచారంలో వుంటే పార్టీ పెద్దలు తమ జుట్టు తామే పీక్కునే దశకు వచ్చేస్తున్నారు.

ఎన్నిక తుది ఫలితం గురించి ఏ అంచనా కట్టినా, ఏ జోస్యం చెప్పినా కాకి కబుర్ల క్రిందే లెక్క. అయినా ఊరకుండ లేము కదా! గత ఎన్నిక ఫలితాలలో ఉనాటి పరిస్థితిని పోల్చి చూసి భవిష్యత్తును ఊహించడం ఒక క్షేమకర మార్గం. గత పదేళ్లలో అసెంబ్లీ,

**"ఓటర్ల తీరు గమనిస్తే మాత్రం అగమ్యగోచరం"**

పార్లమెంట్లకు మూడేసి సార్లు ఎన్నికలు జరిగాయి. ఈ ఆరు ఎన్నికల ఓటింగు సరళి ఇదీ-

**అసెంబ్లీ**

| | కాం. | తె.దే. | సి.పి.ఎం. |
|---|---|---|---|
| 1983 | 12,374 | 29,952 | 13,017 |
| 1985 | 29,426 | 46,503 | |
| 1989 | 49,589 | 43,202 | |

**పార్లమెంటు**

| | కాం. | తె.దే. | బిజెపి |
|---|---|---|---|
| 1985 | 28,093 | 44,255 | |
| 1989 | 49 020 | 42 985 | |
| 1991 | 28,585 | 35,953 | 11,397 |

ఈ ఆరు ఫలితాలను గమనిస్తే - తెలుగుదేశానికి సంబంధించి గత పదేళ్లలో ఓట్ల సంఖ్య స్థిరంగా వుందన్న విషయం అర్థమౌతుంది. 1983 లో తెలుగుదేశం, సిపిఎం ఓట్లు కల్పితే 42 వేలు; 1985 లో 46 వేలు; 1989 లో 43వేలు; పార్లమెంట్‌కు సంబంధించి అంతే. 1991 లో బిజెపి ఓట్లు కల్పితే లెక్క సరిపోతున్నది. కాంగ్రెస్‌కు సంబంధించి- 1983, 1989లలో తప్ప స్థిరమైన ఓట్ల సంఖ్య కన్పిస్తున్నది. పై రెండు సార్లు తప్ప తతిమా సందర్భాలలో వారికి 28, 29 వేలప్రాంతంలో వచ్చాయి. 83లో తెలుగుదేశం ప్రభంజనం, కాంగ్రెస్ వ్యతిరేకత వుండింది కాబట్టి ఓట్ల సంఖ్య బాగా తగ్గింది. 89లో శీనయ్య, బెజవాడ పాపిరెడ్డిల మధ్య హోరాహోరీ పోరు జరిగి పోలైన ఓట్ల సంఖ్య హెచ్చడంతో, అధికంగా పోలైన ఓట్లన్నీ కాంగ్రెస్‌కు

**"వ్యక్తిగతం తప్ప పార్టీలు, విధానాలు ప్రస్తావనలో లేవు"**

పడ్డాయి. ఈ విశ్లేషణ ప్రకారం చూస్తే - తెలుగుదేశం 30, సిపిఎం 13, కాంగ్రెస్ 29 వేల ఓట్లు బ్యాంకులు కల్గి వున్నట్లు తెలుస్తుంది. ఇవి స్థిరమైన ఓట్లు. ఏ గాలికొట్టినా మార్పు చెందనివి. 1985 లో విపరీతమైన కాంగ్రెస్ వ్యతిరేక గాలులు వీచినప్పుడు, 1989లో తెలుగుదేశం పట్ల వైముఖ్యం ఏర్పడినప్పుడు మారని ఓట్లు ఇప్పుడూ మారవుకదా? తెలుగుదేశం 30 వేలలో బిజెపి ఓట్లు కూడా కొంత భాగం కలిసి వున్నాయి. 1991 లో తెలుగుదేశం ఓట్ల సంఖ్య సాధారణంగా వచ్చే 43 వేల నుంచి 35 వేలకు తగ్గడానికి కారణమదే! సి.పి.ఎం. బి.జె.పి.లు పొందే ప్రతి అదనపు ఓటూ తెలుగుదేశందే అయి వుంటుంది. కాంగ్రెస్‌లో మాత్రం మార్పు వచ్చే అవకాశం లేదని 1985 లో తెలుగుదేశం గాలిలో వచ్చిన ఓట్ల సంఖ్యను బట్టి అర్థం చేసుకోవచ్చు. ఈ లెక్క ప్రకారం కాంగ్రెస్‌కు అదనంగా ఓట్లు పడక పోయినా, ప్రతిపక్షం ఓట్లు మూడుగా చీలి

**"సిపిఎం, బిజెపి తెలుగుదేశానికి గండికొడ్తున్నాయి"**

పోతున్నాయి కాబట్టి, పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు గెల్చి తీరాలి. ఇటీవల జరిగిన 91 పార్లమెంటు ఫలితం తీసుకున్నా దేశం ఓట్ల నుంచి సిపిఎం భాగం తీసివేస్తే 22 వేలు మాత్రమే మిగుల్తాయి. కాంగ్రెస్‌కంటే అది ఆరున్నర వెయ్యి తక్కువ. ఈ తేడా చాలు- రామచంద్రా రెడ్డి గారు గెలవడానికి. అభ్యర్థి ఎవరైనా, గాలి ఎటు తోలినా కాంగ్రెస్‌కు 29 వేల నికరమైన ఓట్లున్నప్పుడు, మాగుంట సుబ్బరామ రెడ్డి గారి వ్యక్తిగత గ్లామర్, చారిష్మా, పరిమితి లేని వనరుల బలం జత కలిస్తే కాంగ్రెస్‌కు అదనంగా మరొక 10 వేల ఓట్లయినా వచ్చే అవకాశం వుంది. అదే జరిగితే ఏ ఇతర పార్టీ కూడా కాంగ్రెస్ దరిదాపులకు రాలేదు. రామచంద్రా రెడ్డి గారు గెలవడమే కాదు, మంచి మెజారిటీ కూడా వస్తుంది. 1989 లో వలె అత్యధిక

**"జిల్లా రాజకీయాలలో కొత్త పోకడలకు కోవూరులో నాంది"**

శాతం పోలింగు జరిగి, 95 వేల ఓట్లు పెట్టెల్లో పడతాయనుకుంటే - ఈ విశ్లేషణ ప్రకారం కాంగ్రెస్‌కు 38, తెలుగుదేశంకు 25, సిపిఎంకి 18, బిజెపికి 12 వేల ఓట్ల లెక్కన రావాలి. పోలింగు తగ్గితే మొదట చెప్పిన లెక్క ప్రకారం కాంగ్రెస్ 29వేల ఓట్లు పొంది గెలవాలి. ఏదైనా విచిత్రం జరిగితే తప్ప ఈ లెక్కల్లో తేడా రావడానికి వీలు లేదు.

ఆ విచిత్రమంటూ జరిగితే అది శీనయ్య పై సానుభూతి పవనం ఒక్కటిగానే వుండవచ్చు నన్పిస్తుంది. ఈ ఉపఎన్నిక విశిష్టత కూడా అదే! ప్రధాన పార్టీలైన కాంగ్రెస్, తెలుగుదేశంలు రెండూ కోవూరులో పార్టీ విధానాలు, ఇందిరా, రాజీవ్, ఎన్టీఆర్ వంటి నాయకులు, ఇరువురు అభ్యర్థులు, ఆయా ప్రభుత్వాల పనితీరువంటి వాటి పై తమ దృష్టిని కేంద్రీకరించడం లేదు. ప్రచారంలో, ప్రసంగాలలో ఆ ప్రస్తావనే రావడం లేదు. కాంగ్రెస్ వాదులు మాగుంట సుబ్బరామ రెడ్డి మంచి తనం, ఉదారత, ఒంగోలులో

తరువా 7 పేజీలో

## నెల్లూరు వచ్చేస్తున్న విశిష్టులు

### ముఖ్యమంత్రి

కోవూరు ఎన్నికల ప్రచారం కోసం ముఖ్యమంత్రి శ్రీ కె.విజయభాస్కర రెడ్డి 12 తేది నెల్లూరు రావచ్చునని అనధికార సమాచారం. కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు. 12 మొదలు 17 తేది వస్తారని కూడా చెప్తున్నారు.

### జనార్ధన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి ఈ రోజు (7 తేది) గూడూరులో ఒక వివాహానికి హాజరు కావు మద్రాసు మీదుగా నెల్లూరు వచ్చారు; రాత్రికి అదే దారిన హైదరాబాదు వెళ్లి పోతారు.

### ఎన్టీఆర్

తెలుగుదేశం సర్వాధినేత ఎన్.టి. రామారావు 15 తేది కోవూరులో ప్రచారం చేస్తారట.

### తులసీదాస్

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మత్తి తులసీదాస్ 12 తేది హైదరాబాదు ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరులో దిగుతారు ; మంత్రి శ్రీ పెంచలయ్య కుమార్తె వివాహానికి హాజరవుతారు; తర్వాత ఆ రోజు 13 తేది కోవూరు ఎన్నికల ప్రచారంలో పాల్గొని ఆ రాత్రి నారాయణాద్రిలో హైదరాబాదుకు రైలెక్కుతారు.

### శేఖర్‌కు ప్రమోషన్

సర్వప్రియుడు, స్నేహ సంపన్నుడు, పరిచయాల నిధి; నేషనల్ - న్యూ ఇండియా - ఓరియంటల్- యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ కంపెనీలకు చెందిన మోటార్ థర్డ్ పార్టీ క్లయిమ్స్ ఆఫీసుల మేనేజరుగా మద్రాసులో వుంటున్న శ్రీ యాళ్ల శేఖర్ యునైటెడ్ ఇండియా జనరల్ ఇన్సూరెన్స్ కంపెనీ అసిస్టెంటు జనరల్ మేనేజరు పదవిని అలంకరించ బోతున్నారు. ఈ వున్నత పదవి నలంకరిస్తున్న ఆంధ్రులలో శేఖర్ ఐదవ వారు. బి. సంగమేశ్వర రావు, కె.వి. సుబ్బారెడ్డి (తోటపల్లి గూడూరు), ఎస్.వి. బిలాని, కె. రాజశేఖర రావు గారలు గతంలో ఈ పదవి నిర్వహించారు.

బి.వి.ఎస్. జనరల్ ఇన్సూరెన్స్ కంపెనీలో వుద్యోగిగా చేరిన శేఖర్ తన ప్రతిభ సమర్థతలతో క్రమానుగత పురోభివృద్ధి నందుతూ, నెల్లూరు - హైదరాబాదు - బొంబాయి - బరోడా - ఢిల్లీ - మద్రాసులలో వివిధ హోదాలలో తన స్నేహ స్వభావంతో వ్యాపారాన్ని విస్తరింప జేసి, నేడు ఈ వున్నత స్థితికి వచ్చారు. వున్నత వర్గాలలో వున్న విశేష పరిచయాలు, చొరవ చురుకుదనాల వల్ల జనరల్ మేనేజరు కాగలడని కూడా అనుకోవచ్చు.

శేఖర్ కేవలం స్వయం ప్రతిభతో పైకి వచ్చిన వాడు. కడప జిల్లా కుమారుడు - నెల్లూరు అల్లుడు - అప్పుడు జిల్లా రాష్ట్ర హద్దులు లేని దేశ పౌరుడు! వున్నత పదవిని పొందుతున్న సందర్భంలో శేఖర్‌కు మా శుభాభినందనలు.

### అమెరికాలో నెల్లూరీయుడి పదోన్నతి

నెల్లూరు, దామరమడుగుకు చెందిన చింతలపల్లి రామమోహన్ రెడ్డి అమెరికాలోని కొలంబియా బ్రాడ్ కాస్టింగ్ కంపెనీలో అకౌంటింగ్ విభాగాధి పతిగా పదోన్నతి పొందారు. రామమోహన్ ఛార్టర్డ్ అకౌంటెంట్. పదిహేనేళ్ల క్రితం అమెరికా వెళ్లి, అంచెలంచెలుగా, అసమాన ప్రతిభతో ఉన్నత స్థానాలు అధిరోహిస్తూ ఈ స్థానానికి వచ్చారాయన.

కొరవ 7 పేజీలో



కోవూరు బస్టాండ్ సెంటర్‌లో కాంగ్రెస్ కటౌట్; కొడవలూరు సెంటర్‌ను నింపి వేసి వున్న వివిధ పార్టీల బ్యానర్లు.

# తెలుగుదేశం నిరాశ చెందనవసరం లేదు- కాంగ్రెస్ భరోసాతో వుండడానికీ లేదు!

# కోవూరు జనార్ణవమైంది!

ఎవరి నిముషంలో అభ్యర్థి నిర్ణయం జరగడం వల్ల నామినేషన్ సమయంలో సాదా సీదాగా వ్యవహరించారన్న అసంతృప్తిని పోగొట్టు కోవడానికి కాంగ్రెస్ పార్టీ, 2 తేది సాయంత్రం కోవూరు టౌన్‌లో పెద్ద ప్రదర్శన, బహిరంగ సభ జరిపింది. మంద బయలు నుంచి ఊరేగింపు; రైల్వే స్టేషన్ రోడ్డులో సభ. జనంలో అద్భుతమైన రెస్పాన్స్. కోవూరు ఇరుకు రోడ్లు ఇసకేస్తే రాలని జనంతో కిటకిటలాడాయి. నియోజక వర్గం అంతటి నుంచి జన సమీకరణ చేశారు. బస్సులు, ట్రాక్టర్లలో కోపంగా తరలించారు. టౌనంతా బ్యానర్లు, 'స్టర్లతో' నిండిపోయింది. బస్టాండు సెంటర్‌లో 30 అడుగుల కటౌట్ పెట్టారు.

మంద బయలు నుంచి ఓపన్ టాప్ జీపులో జనార్ధన రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి, ఆనం సంజీవ రెడ్డి, పెళ్లకూరు, జి.కె. రెడ్డి, దేవకుమార రెడ్డి వగైరాలంతా ఊరేగింపుగా తరలి వచ్చారు. డప్పుల మోతతో చెవులు దిమ్మెత్తి పోయాయి.

సభా వరణం జనార్ణవంగా వుండింది. వేదిక మీద నాయకులూ పెరిగి పోయారు. వారందరినీ ఒక పద్ధతిలో కూర్చొ బెట్టి, తొక్కిసలాట ఆపి, సభ మొదలు పెట్టడానికి అరగంట పట్టింది. ఆనం సంజీవ రెడ్డి గారికి. శ్రీ పెళ్లకూరు ప్రభాకర రెడ్డిని పార్టీలో చేర్చుకుంటున్నట్లు ప్రకటించి సభారంభం చేశారు. చీఫ్ విప్ నన్నపనేని రాజకుమారి తొలి వక్త. ఆమె మాట తీరు తెలిసిందే గదా! మైకు పగిలి పోయేటట్లు మాట్లాడింది. తెలుగుదేశాన్ని తూర్పార బట్టింది. చనిపోయిన శీనయ్యనూ వదలి పెట్టలేదు.

దేవాదాయ మంత్రి శ్రీ కోనేరు రంగ రావు సుదీర్ఘ ప్రసంగం చేశారు. ఆ ఉపన్యాసాలు వినే ఓపిక ఇప్పుడెవరికి వుంది చెప్పండి? జనం పది నిముషాలకు పైన ఓపిక పట్టలేక పోయారు. బెజవాడ గోపాల రెడ్డి గారు ఆశీర్వచనం పల్కారు. ఈ నెల 21 తేది రాజీవ్ వర్ధంతి కాబట్టి, ఆ రోజుకు ఫలితం వెలువడే ఈ ఎన్నికలో కాంగ్రెస్ గెలిస్తే రాజీవ్ ఆత్మ శాంతిస్తుందన్నారాయన. తర్వాత పెళ్లకూరు - తాను ఇఫ్కో సంస్థకు ఇల్లు బాడుగకు ఇచ్చి 14 వేలు తీసుకుంటున్నట్లు తెలుగుదేశం చేస్తున్న దుష్ప్రచారాన్ని ఖండించి, దేముడ్ని ఆరాధించే తన పై నీలాపనిందలు వేసేవారు వారి పాపానికి వారు పోతారన్నాడు. తాను రాజకీయాలలో 40 ఏళ్లు గడిపినా ఒక్క రూపాయి సంపాదించలేదని, వున్న పొలం అమ్ముకున్నానని చెప్పారాయన.

> **కాంగ్రెస్ కార్యకర్తల సభ నామినేషన్ నాటి కొరత తీర్చింది!**

మాగుంట సుబ్బరామరెడ్డి గారు తాను ఒంగోలు ఎమ్పీ అయిన తర్వాత ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టి, 5 కోట్లు ఖర్చు పెట్టానని, 1160 మందికి తన సంస్థలలో ఉద్యోగాలిచ్చానని చెప్పారు. రాజీవ్ గాంధీ కోరిక పై రాజకీయ ప్రవేశం చేసిన తాను తన సంపాదనంతటినీ ప్రజలకు ధారపోయడానికి సిద్ధమని ప్రకటించారు. కోవూరులో పరిశ్రమ పెట్టి వెయ్యి మందికి ఉద్యోగాలిస్తానని, ఒంగోలులో వలె ఇక్కడా తన శక్తి వంచన లేకుండా మంచి పనులు చేసి పెడతానని, పెళ్లకూరును గెల్పించడమంటే తనను గెల్పించినట్లే భావించమని కోరారు.

భారత ఐక్య కమ్యూనిస్టు పార్టీ నాయకుడు శ్రీ వి.వి. నరసింహాచార్యులు కాంగ్రెస్‌కు తమ పార్టీ మద్దతు ప్రకటిస్తూ మాట్లాడారు.

చివరగా, మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి కాంగ్రెస్ పార్టీకి ఓటు వేయడం ప్రజల కెంత క్షేమమో వివరిస్తూ ప్రసంగించారు. దేశం కోసం పాటుపడే పార్టీ కాంగ్రెస్ ఒక్కటే నన్నారాయన. అప్పుల బారి నుంచి దేశ ఆర్థిక వ్యవస్థను కాపాడి, ద్రవ్యోల్బణాన్ని 16 శాతం నుంచి 7 శాతంకు తగ్గించడంలో పి.వి. ప్రభుత్వం సాధించిన విజయాలను ప్రస్తావించారు. తెలుగుదేశం అభ్యర్థి ప్రసన్న కుమార్ రెడ్డి రాజకీయ తొలిదశలోనే పార్టీ మారి పొరపాటు చేశాడని; సిపిఎం విషయానికొస్తే ప్రపంచ మంతా కమ్యూనిస్టు పార్టీలు అంగళ్లు మూసుకొని దివాలా తీస్తున్నప్పుడు ఇప్పుడిక్కడ కమ్యూనిస్టు అభ్యర్థిని గెల్పించడం వల్ల ప్రయోజనమేది

కొరవ 7 పేజీలో

కావలి అడ్వొకేట్ వివి నరసింహాచార్యులు కుమారుడు విజయకుమార్, శ్రీ లక్ష్మి వీరి వివాహం ఇటీవల గుంటూరులో జరిగింది.

# పెండ్లిండ్లు

గ్రహాలు కట్టలేక, అర్థ దార్లు తొక్కలేక, అపభ్రంశపు పనులు చేయలేక, అడుగులకు మడుగులొత్తలేక తియ్యగా మాటలు చెప్పలేక, శ్రమ పడలేక, రాజకీయాలను సరదాగా తీసుకొని వ్యక్తి [illegible] త్యంతో స్వాతంత్ర్యయోధుడైన సీనియర్ కాంగ్రెస్ వాది, విద్యాధికుడు, వున్నత ప్రమాణాలు పాటింప గలిగిన వాడై వుండి గూడా శాసనసభ్యత్వం, పార్లమెంటు సభ్యత్వం, అతి పెద్ద పదవిగా కేవలం ఆంధ్ర ప్రదేశ్ స్పీకర్ పదవిని మాత్రం అధిష్ఠించ గలిగిన సంస్కార శీలి మృదు భాషి శ్రీ రేబాల దశరథ రామరెడ్డి మనుమడు; అంటే - హై కోర్టు ప్రాక్టీసును వదలి, మునివర్తిలో స్థిరపడి, వేద్యము పుస్తక పఠనంతో జీవిత పరమార్థ అన్వేషణాసక్తతతో ప్రశాంత జీవితాన్ని గడుపుతూ, రాజకీయ విముఖుడైనా ఖద్దరు ధారణా వ్రతాన్ని వీడని పుత్రముడైన మిత్రుడు శ్రీ రేబాల సుందర రామి రెడ్డి తనయుడు - ప్రవీణ్ కుమార్; నిడిగుంట పాళెం శ్రీ కె. శ్రీనివాసులు రెడ్డి తనయ హిమబిందు పాణిగ్రహణం మే 5 తేది శ్రీ కస్తూరి దేవి విద్యాలయంలో అహూతుల ఆడంబరంతో జరిగింది. తండ్రీ కొడుకులిరువురు అహూతులు ప్రతి ఒక్కరిని ఆప్యాయంగా పలుకరించారు.

* * *

గొట్లపాళెం - శ్రీ చెర్లో రాధాకృష్ణారెడ్డి కుమారుడు వెంమ సుబ్బారెడ్డి; వరిగొంద - శ్రీ కోడూరు రామలింగా రెడ్డి కుమార్తె రాజేశ్వరి కల్యాణం 1 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

* * *

నెల్లూరు న్యాయవాది - నోటరీ అయిన శ్రీ సి. కృష్ణారెడ్డి సోదరుడు, లాకాలేజి అధ్యక్షుడుగా పనిచేసిన యువకుడు సి.వి. రమణారెడ్డి బి.కాం., బి.ఎల్.; కొమరిక - శ్రీ పి. రమణారెడ్డి కుమార్తె ఝాన్సీ పరిణయం 1 తేది నెల్లూరు టవున్ హాలులో జరిగింది.

* * *

వ్యవహార్తీలింపిన సుపరిచిత జర్నలిస్టు, స్పిన్నింగు మిల్లు తొలి అధ్యక్షుడు శ్రీ నలమోలు గోపాల కృష్ణయ్య కుమారుడు - అంటే, యునైటెడ్ ఇన్సూరెన్స్ కంపెనీ నెల్లూరు అసిస్టెంటు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు శ్రీ నలమోలు రాజేంద్ర ప్రసాద్ తమ్ముడు - నెల్లూరు మహిళా పాలిటెక్నిక్ లెక్చరరు హేమ చంద్ర; పేరాల - శ్రీ అందె నరసింహా రావు కుమార్తె పద్మశ్రీతో పేరాలలో 1 తేది వివాహం జరిగింది.

* * *

నెల్లూరు జీ.ప్ర.వ. ఉద్యోగి - ఇంటి పేరు, సొంత వూరు నావూరైన శ్రీనివాస మూర్తి కుమారుడు వెంకట మురళి మనోజ్ కుమార్; గంగపట్నం - శ్రీ దందిగుంట వెంకట్రాయులు నాయుడు మనుమరాలు, సుధాకర్ రావు కుమార్తె అరుణ వివాహం దర్గామిట్ట రాజరాజేశ్వరి ఆలయ కల్యాణ మండపంలో 5 తేది జరిగింది.

'నాయుడు' బిరుదులు గంగపట్నం వంటి గొప్ప గ్రామాలకు చెందిన కొందరు నాయుళ్లను ఇంకా వదల లేదండి!

* * *

వరిగొంద రైతు శ్రీ గూడూరు జానకి రామ రెడ్డి ఇరువురు కుమార్తెలకు 5 తేది నెల్లూరు టి.టి.డి.లో వివాహాలు జరిగాయి.

శ్రీ లత బి.కాం.; ముత్తుకూరు శ్రీ కాకుటూరు దొరస్వామిరెడ్డి కుమారుడు విష్ణు ఎం.బి.ఎ., ఒక జత-

శ్రీ రూప; మొమిడి - శ్రీ తిరుమూరు చంద్రశేఖర రెడ్డి కుమారుడు శివ బి.ఇ., రెండవ జంట-

విద్యావంతులైన అల్లుళ్లను బడసిన జానకిరామరెడ్డి అదృష్టవంతుడే!





## మజ్జి

(మొదటి పేజీ కొరవ)

విషయంలో పివి ఆలోచన ఏమిటో బయట పడడం లేదు. సాధారణంగా ముఖ్యమంత్రి మాట కాదనడని అంచనా! ద్రోణంరాజు సత్యనారాయణ గారు తాని పదవికి పోటీపడడం లేదని ప్రకటించారు. మజ్జి తులసీదాస్ మాత్రం పివి తనను పదవి నుంచి దించడనే విశ్వాసంతో వున్నారు; మాజీ ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి అండ కూడా సంపాదించారు.

## సానుభూతి

(5 పేజీ కొరవ)

ఆయన స్వంతంగా అమలు చేస్తున్న కార్యక్రమాలు, విరాళాలు, వాగ్దానాలతో ప్రజలను మచ్చిక చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటే; తెలుగుదేశం నాయకులు -శ్రీనివాసులు రెడ్డి నియోజక వర్గానికి చేసిన సేవ, కట్టించిన బ్రిడ్జిలు, వేసిన రోడ్లు, మరణించే ముందు కోవూరులో తిరిగి ఆస్పత్రి పాలు కావడం వంటి విషయాలు మాత్రమే ప్రస్తావిస్తున్నారు. జిల్లా రాజకీయాలలో కొత్త పోకడ ఇది.

కాంగ్రెస్‌కు సంబంధించి జిల్లా వ్యవహారాలలో ఒక నూతన ప్రయోగానికి కోవూరులోనే శ్రీకారం చుడుతున్నట్లు కన్పిస్తుంది. ఆ సంగతులకిది సందర్భం కాదు; తర్వాత ముచ్చటించుకుందాం!

పెళ్లకూరు ఏ నక్క తోకను తొక్కి వచ్చాడో కాని, మాగుంట సుబ్బరామ రెడ్డి దేముడులా దొరికాడు. కోవూరులో కాంగ్రెస్‌కు మాగుంట మద్దతు దొరుకుతుందని అందరూ అనుకున్నారే తప్ప మాగుంటే సర్వంగా ఎన్నిక జరుగుతుందని ఎవ్వరూ వూహించలేదు. పొద్దున ఆరు నుంచి రాత్రి రెండు గంటల వరకు నెత్తి మీద ఎంత మార్చి వేస్తున్నా లెక్క చేయకుండా గ్రామ గ్రామం తిరుగుతున్నారు సుబ్బరామరెడ్డి. వెళ్లిన చోటల్లా ఏదో ఒక వాగ్దానం. దేవాలయాలు, మసీదులు, మంచి నీటి బోర్లు, స్కూలు భవనాలు... ఒకటేమిటి, కోవూరు పంట పండిపోయింది. జనమూ అన్నే ఎగబడి వస్తున్నారు. వూదూరా స్వాగతాలు చెప్తున్నారు. ఎదురేగి హై కొడుతున్నారు. సుబ్బరామ రెడ్డి అంతగా నిమగ్నం కాకుంటే రామచంద్రా రెడ్డి గారు వూళ్లకు పోవడం, ప్రచారం చేయడం జరిగే పనిగా అన్పిస్తుందిపుడు. ఇక్కడ కాంగ్రెస్ గెలిస్తే అది సుబ్బరామ రెడ్డి గెలుపు క్రిందే లెక్క.

అయితే సుబ్బరామ రెడ్డి గ్లామర్ ఎంత ఉధృతంగా వుందో రామచంద్రా రెడ్డి అభ్యర్థిత్వం పట్ల వ్యతిరేకతా అంతే వుంది. ప్రతి గ్రామంలో ఆయన ఓటర్ల నిరసనను ఎదుర్కొంటున్నారు. అభ్యర్థిగా ఏ వర్గంలోనూ అభిమానం సంపాదించుకోలేని దురదృష్టకర పరిస్థితులలో, ఈ వయస్సులో, ఇఫ్కో వంటి స్థాయి కల్గిన పదవి వదలి పెట్టి ఈ ఎన్నికకు పూనుకోవడం రామచంద్రా రెడ్డి గారు చేసిన పెద్ద తప్పు.

మాగుంట గ్లామర్‌కి దీటుగా శీనయ్య సానుభూతి పవనాలు వీస్తున్నాయి. మరొక పరిస్థితిలో అయితే మాగుంట ధాటికి తెలుగుదేశం గాలిలో కలిసి పోయి వుండాలి. కాని, ఈ రోజు వరకు పరిస్థితి చూస్తే తెలుగుదేశం నిరాశ చెందాల్సిన, భయపడి వెనక్కు పోవలసిన పరిస్థితి లేదన్నది వాస్తవం. తెలుగుదేశం ఓట్ల బలం చాలా గుంభనంగా వుంది. ప్రసన్న కుమార్ రెడ్డి తరపున వారి కుటుంబ మహిళలు చేస్తున్న ప్రచారం స్త్రీ ఓటర్లలో బాగా ప్రతిస్పందన తెస్తున్నది. అయోధ్య కోపంతో వున్న ముస్లింలు తెలుగుదేశం, సిపిఎంల వైపు మొగ్గు చూపుతున్నారు. అయితే ప్రసన్న కుమార్ రెడ్డికి వనరుల కొరత బాగా ఇబ్బందిగా వున్నట్లుంది. కాంగ్రెస్ ప్రచారంతో ఢీ కొని నిలువ లేక పోతున్నారు. చంద్రబాబు నాయుడు, ముద్దు కృష్ణమ నాయుడు వచ్చి వెళ్లారు కాని ఊకదంపుడు ఉపన్యాసాలు తప్ప ఎన్నికల యంత్రాంగం బలోపేతం చేయడానికి సహకరించి నట్లు లేదు. సుబ్బరామ రెడ్డి పలుకుబడి వల్ల ప్రతి గ్రామంలోనూ నాయకులు కాంగ్రెస్ జెండా పట్టడమో లేక ఎటూ పోలేక నిలబడి పోవడమో జరుగుతున్నది. తెలుగుదేశానికి గ్రామాలలో మనుషులు దొరకకుండా పోవడానికి కారణమదే. వారి కుండే ఓట్లను పెట్టెల వరకు తీసుక వెళ్ల గల్గితే కాంగ్రెస్‌కు గట్టి పోటీ ఇవ్వ గల్గుతారు; లేకుంటే వూహించనంత వెనుకబడి పోతారు.

సిపిఎం ఎందువల్లనో స్తబ్దుగా వుంది. తెలుగుదేశం తోకగా తిరగడం అలవాటై పోయిన వారికి, స్వతంత్రంగా ఎన్నికలు నిర్వహించ వలసి రావడం కొత్తగా వున్నట్లుంది. కార్లు, గీర్ల హంగామా బాగానే చేస్తున్నారు కాని, ఓటరును కలవడంలో చురుకుదనం కన్పించడం లేదు. తెలుగుదేశం, కాంగ్రెస్ పోటాపోటీలో వారు మసక బారి పోతున్నారు. స్థిరమైన కమ్యూనిస్టు భావాలు కల్గిన ఓట్లు తప్ప, అదనంగా ఓటర్లను ప్రభావితం చేసే పరిస్థితులలో వారు లేరు. జక్కా వెంకయ్య పట్ల ప్రజలలో పూర్వపు అభిమానము, భయము రెండూ లేవు. కమ్యూనిజం పట్లనే ఆదరణ తగ్గి పోతున్నది కదా? తెలుగుదేశం విజయావకాశాలకు గండి కొట్టడానికి తప్ప సిపిఎం పోటీ వ్యర్థమే!

బిజెపిది నామమాత్రపు పోటీ. మాకూ ఒక అవకాశం ఇవ్వండి అని వెంకయ్య నాయుడు, నరేంద్ర దీనంగా ప్రాధేయ పడుతున్నారు. కాని, వారి దీనాలాపాలు విన్పించుకునే వారు లేరు. అయోధ్య తర్వాత తమ ఓట్లు పెరిగాయా, తరిగాయా అన్న సంగతి అంచనా వేసుకోవడానికి తప్ప బిజెపి వరదయ్య పోటీ నిష్ఫలమే!

ఈ వారానికి కోవూరు ఉపఎన్నిక పరిశీలన ఇదీ! పై వారానికి పరిస్థితి బాగా స్పష్టం కావచ్చు.

## కోవూరు

6 పేజీ కొరవ

పండదని; హిందూ మత తత్వ బిజెపి పార్టీని ఆదరిస్తే దేశంలో శాంతి అదృశ్యమై పోతుందని చెప్తూ, కాంగ్రెస్‌ను గెల్పించమని విజ్ఞప్తి చేశారు.

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

ఆయన సోదరుడు శ్రీ శ్యామమోహన్ జాతీయ స్థాయి కల్గిన ప్రతిష్ఠాత్మకమైన నేషనల్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్; దామరమడుగు పెద్ద రైతు చింతలపల్లి వెంకట రెడ్డి కుమారుడు. ఉన్నతికి వచ్చిన రామమోహన్ గారికి మా అభినందనలు.

### రవీంద్ర జయంతి

విశ్వకవి రవీంద్ర నాథ్ టాగూర్ జయంతి 16 తేది సా. 6.30 గంటలకు టవున్ హాలులో జరుగుతుంది. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు అధ్యక్షత వహిస్తారు. తిరుపతి యూనివర్శిటీ ఆంగ్ల శాఖాధ్యక్షుడు ప్రొఫెసర్ జి. నాగేశ్వర రావు గారు "రవీంద్రుని రమణీయక దృష్టి" అను అంశం పై వుపన్యసించి పి.వి. రమణారెడ్డి ఏటా తన తల్లి స్వర్గీయ వెంకట సుబ్బమ్మ పేర యిచ్చే అవార్డు స్వీకరిస్తారు.

వర్ధమాన సమాజం ఆధ్వర్యం; కార్యదర్శి శ్రీ టి.వి. నరసింహాలు సాదర ఆహ్వానం.

## ప్రకటన

ఇందు మూలముగా, నెల్లూరు జిల్లా, వెంకటగిరి టవున్, కాశీపేటలో ఉన్న డోరు నెం 10/53, పెద్ద ఇల్లు, ఇంటికి సంబంధించిన ఖాళీ జాగా, బావి, పెరటిలో అడపాల వెంకట సుబ్బయ్య, అడపాల శ్రీనివాసులు, అడపాల చిన్ని, అడపాల క్రిష్ణయ్య మరియు అడపాల రాధాకృష్ణయ్య, అడపాల సత్యనారాయణ, అడపాల జితేంద్ర కుమార్‌లు హక్కు కల్గియున్నారు. సదరు ఇంటిని ఏ విధమైన అన్యాక్రాంతము చేసి యుండలేదు. ఒక వేళ సదరు ఇంటిని గురించి విక్రయ అగ్రిమెంట్లు గాని, దస్తావేజులు గాని ఎవరైనా పుట్టించి యున్నచో సదరు పత్రములు గాని, అగ్రిమెంట్లు గాని పై నమోదు పరిచియున్న వ్యక్తుల హక్కులకు భంగకరము కాజాలదు. లక్ష్మమ్మనేని విహారానందము గారికి సదరు ఇంటి యందు హక్కులు గాని, సంపూర్ణ హక్కులు గాని లేవని ఇందు మూలముగా తెలియజేయడమైనది.

**A. Subrahmanyam**

33 Advocate, Gudur.

## నెల్లూరు సబార్డినేటు జడ్జి వారి కోర్టులో

S.C. No. 114/1991

ఇండియన్ బ్యాంకు, నెల్లూరు — వాది

Vs

1. మర్లపాటి వెంకయ్య, మరియు ఇతరులు — ప్రతివాదులు

To

2. మర్లపాటి చెంచురామయ్య, S/o. వెంకయ్య.

3. మర్లపాటి రత్నం, S/o. వెంకయ్య, కుసుమ హరిజన వాడ, నెల్లూరు

### నోటీసు

పై వాది మీ మీద దావా బాకీ రాబట్టుకొనుటకు పై దావా వేసి వుందున ఇందు విషయమై మీకు నోటీసు నిమిత్తమై 24.6.1993 తేది వాయిదా వేసినారు. ఆ రోజు పగలు 10.30 గంటలకు మీరు ఖుద్దున గాని, వకీలు ద్వారా గాని హాజరు కావలసి యున్నది. అట్లు హాజరు కాకున్న మీ పరోక్షమున తీర్మానించబడును.

**కొండూరు శేషారెడ్డి**

వాది తరఫు అడ్వొకేటు

# శివారెడ్డి పద్యాలు

### పెళ్లకూరు

"ఎన్నికల్లో టిక్కెట్టు ఏ పార్టీ వెళ్తుర్ధా?"
అన్ని తెలిసి మీరు నన్ను ప్రశ్నిస్తారె
బాగా బట్టు విజము బయట బెట్టు
దేనికంట టిని పోనితంటు!
కర్త్రిలేని పచ్చి కాంగ్రెసు మనవారు
పెళ్లకూరు అమిత ప్రీతి పెద
పొదలంటె, వేరె పొక్షమక్కర్లేదు
తిరుగులేరు కవిని తీర్పు యిస్త!

పొలిము గ్రౌండు బట్లా
వేల జనము చకరకాల విందులు జక్కా!
వాలిక వచ్చా యిట్నే
కాలము కలిసొచ్చి మాచ కళ్యాణమ్ము!

### వినుజ — జక్కా రామమోహన్

అందచందముంది, ఐశ్వర్యమూ వుంది
చదువు సాము వుంది, సకలముంది
యింతకంటె భాగ్యమేముంది, యేదుంది,
ఎక్కడుంది, చెప్పు లెక్కవేసి!

### శుభలేఖలు

ఫ్రెండ్సుఎంత మందొ పంపారు శుభలేఖ
లందుకున్న, కళ్లకద్దుకున్న
కవికి రాను కారుందా, ప్లెయినుందా?
పెళ్లి బారయింది, ఏమి చేయను?

ఊళ్ల నాళ్ల నుండి పెళ్లిళ్ల శుభలేఖ
లెట్టె వస్తె, కవిని అందుకొని
ఎగిరి గంతులేసి ఏదేదో జేసేది
అయ్యొకరోజ్లు, తిరిగి అంకురిచు!

## జనవాణి

(3 పేజీ కొరవ)

వార్తన పోస్టులు భర్తీ చేసేందుకు పరీక్షలు నిర్వహించి 100 రోజులయ్యింది. కాని ఇంత వరకు ఫలితాలు ప్రకటించలేదు. 1977-78 సంవత్సరాల్లో ఉపాధి కల్పనా కార్యాలయాల్లో పేరు నమోదు చేసుకొన్న వారికి ఈ పరీక్షార్హత లభించింది. 34 సం. వుద్యోగ నిబంధన మూలంగా చాలా మందికి ఇదే చివరి అవకాశం. దయచేసి నిరుద్యోగుల పై దయ వుంచి వెంటనే ఫలితాలు ప్రకటించి ఇంటర్వ్యూ జరపాలని వినతి.

కల్లిపురం — కె.వి. భాస్కర రావు

### ఏమిటీ ఈ ఉన్మాదం!

ఇటీవల కాలంలో జరుగుతున్న నేరాలు ఘోరాలు చూస్తుంటే ప్రపంచం ఎటుపోతున్నదో అర్థం కావడం లేదు. కుంటి వాని వేషంలో ఒకరు విమాన మెక్కి దాన్నిదారిమళ్లిస్తే; మరోచోట స్కూలు పిల్లలు విమానాన్ని 'హైజాక్' చేసారు. తాజాగా లంకలో సైకిల్ పై వచ్చిన 'మానవ బాంబు' శ్రీ లంక అధ్యక్షుడ్ని బలితీసుకున్నాడు. దురభిమాని కత్తిగాటుకు ఒక టెన్నిస్ క్రీడాకారిణి ఆస్పత్రి పాలయ్యింది. ఈ వున్మాదాలకు చరమగీతం ఎవరు పాడుతారు? మరో గాంధీ ఎక్కడ పుడతారు?

నెల్లూరు — ఒక సామాన్యుడు

### మనిషి బలహీనతలను సొమ్ము చేసుకొంటున్నారు

ఇటీవల కాలంలో కొందరు పత్రికా రచయితలు మనిషి బలహీనతలను సొమ్ము చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. కుటుంబ సమేతంగా చదవ తగ్గ వార పత్రిక లంటూ కుటుంబంలో మరో వ్యక్తి దగ్గరుండగా చదవలేని విషయాలు వ్రాస్తున్నారు. ఈ పుస్తకాలు స్లో పాయిజన్‌లా పలువురు మహిళలు, యువకులను ఆకర్షిస్తున్నాయి. 'స్వాతి' 'ఆంధ్రజ్యోతి' వంటి పత్రికలు పలువురు చేతుల్లో కళకళ లాడడం దీని ఫలితమే. పాఠకుల్లో కామవాంఛల్ని రెచ్చగొట్టి, వాళ్లను వివేక భ్రష్టులుగా చేసి పబ్బం గడుపు కోవాలని చూస్తున్న వీరిని ఏం చేయాలి? చివరగా ఓ మాట; ఏప్రెల్ 23 తేది జమీన్‌రైతు సంచికలో పత్రికల్లోని బూతుని విమర్శిస్తూ వాటిని యధాతథంగా 'కోట్' చేయడం బాధాకరం.

వెంకటాచలసత్రం— హెచ్.వి.వి. రంగారావ్

### బాధాకరం

ఏప్రెల్ 23 తేది 'జమీన్‌రైతు' సణుగుడు శీర్షికలో ఆంధ్రజ్యోతి సంస్థ ప్రచురణలలోని శృతి మించిన శృంగారపు పోకడలను విమర్శించినందుకు అభినందనలు.కాని ఆ విషయాలను మీరు మక్కికి మక్కికి తిరిగి ప్రచురించడమే బాధాకరం. విమర్శలో ఫలానా తేదీ పేపరులో అని ప్రస్తావించి వుంటే బావుండేది. దివ్యసుభాషితాల్లా వాటిని జెరాక్స్ చేయడం మాత్రం జమీన్‌రైతు పాఠకులను బాధపెట్టింది.

అల్లూరు— దొగిపర్తి సత్యనారాయణ

### వీధి దీపాలు వేయండి

సుందర్‌డీలక్స్ థియేటర్ ముందు నుండి ములుమూడి బస్టాండు వరకు వెళ్లే రహదారిలో గత కొన్ని రోజులుగా వీధి దీపాలు వెలగడం లేదు. దీని వల్ల ఆ రోడ్డు పైన కాలువలకు వేసిన అడ్డాలు కనపడక చాలా మంది తట్టుకొని పడుతున్నారు. సినిమాలు వదలిన తరువాత ఆ వైపు పోవాలంటె భయపడుతున్నారు. ఏసి సెంటర్ నుండి కనకమహల్ వరకు ఇరువైపులా ట్రంకురోడ్డు పై నిరంతరం వెలుతురు పరచుకొని వుంటుంది. ఏసి బొమ్మ పడమర వైపును మునిసిపాలిటీ వారు ఎందుకు నిర్లక్ష్యం చేస్తారో తెలియదు.

మద్రాసు — ఎం. వేణుగోపాల్

### అక్షర సత్యం

గతవారం 'జమీన్‌రైతు' సంచిక సంపాదకీయంలో తమిళనాడున జరుగనున్న ఉపఎన్నికల్లో 'పట్టలి మక్కల్ కర్చి' (పి.ఎం.కె) పార్టీతో కాంగ్రెస్ పొత్తుకు స్వర్గీయ రాజీవ్ గాంధీ ఆత్మ క్షోభిస్తుందన్న వాస్తవాన్ని వ్రాసారు. ఈ విషయం నూటికి నూరు పాళ్లు నిజం. 6 నెలల క్రితం పి.ఎం.కె. పార్టీ తమిళనాడులో ఎల్.టి.టి.ఇ. నాయకుడు ప్రభాకరన్, రాజీవ్ హంతకి ధానుల ఫోటోలను రాష్ట్రమంతా ఊరేగించింది. తీవ్రవాదం, మతోన్మాదం, కులతత్వాలకు వ్యతిరేకమైన కాంగ్రెస్ పార్టీ జయలలిత పై కోపంతో జాతి వ్యతిరేక తీవ్రవాద సంస్థ అని దగిన పార్టీతో పొత్తు పెట్టుకోవడం గర్హనీయం. పెద్దమనిషిగా పిలువబడే పి.వి. ఈ పొత్తు తెంచేస్తారని భావిస్తాను.

నెల్లూరు — జె. పోలిరెడ్డి

## నెల్లూరు సంగతులు

(10 వపేజీ కొరవ)

సాయంత్రంజ్యోతి వెలిగించి ప్రారంభించారు. 9 తేది వరకు కొనసాగే ఈ సప్తాహం తొలి రోజు సభను డాక్టర్ జె.వి. రెడ్డి అధ్యక్షించారు. మహా వక్త ఎస్.కె. యూనివర్సిటీ ప్రొఫెసర్ డాక్టర్ శలాక రఘునాధ శర్మ ప్రసంగిస్తూ ఆది శంకరుల సౌందర్య లహరి హృదయంగమంగా వివరించారు. సభను శ్రీ రామకృష్ణ సేవాసమితి కార్యదర్శి ఎస్.వి. నరసింహా రావు స్వాగతించగా సంయుక్త కార్యదర్శి టి. ఎల్. నారాయణ రావు చివరన వందనాలు చెప్పారు.

## నెల్లూరు మెజీషియన్‌కు బహుమతి

ఆంధ్రప్రదేశ్ మెజీషియన్స్ అసోసియేషన్ 10వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని గుంటూరులో ఏప్రెల్ 25, 26 తేదిలలో జరిగిన రాష్ట్ర స్థాయి మ్యాజిక్ పోటీల్లో నెల్లూరు యువ మెజీషియన్ వామ్మిన సురేష్ బహుమతి పొందారు. 200 మందికి పైగా పాల్గొన్న స్పెషలైజ్డ్ మ్యాజిక్ పోటీల్లో సురేష్ ప్రత్యేక బహుమతి గెల్చుకొన్నాడు. నెల్లూరు నుండి పలువురు మెజీషియన్లు కూడా ఈ పోటీలో పాల్గొన్నారు.

## సణుగుడు

(10 వపేజీ కొరవ)

వ్యాపారులు పిల్చే పార్టీలకు, చెప్పే పసందైన మాటలకు, చేసే ఖరీదైన 'షో'లకు, పోష్ హ్యాబిట్స్ క్రింద అందించే మధిర, మగువ సుఖాలకు భ్రమసి పోయే అధికారులెవరైనా బాబు దురదృష్ట జీవితాన్ని గమనంలో వుంచుకో గల్గితే బాగుపడతారు. నెల్లూరు జిల్లాలో ఈ విస్కీ ఆసాముల ఇంద్రజాలానికి బలై, ముఖ్యమంత్రి సభా వేదిక వెనుక వైపు కూర్చుని బహిరంగంగా బీర్లుకొట్టే దశకు వచ్చిన ఒక యువ ఐఎఎస్ అధికారి వుండేవాడు. అప్పట్లో నెల్లూరు నుంచి బదలీ అయి బ్రతికి పోయాడతను. ఆ హయాంలోని కొందరు ఐపిఎస్ అధికారులు మాత్రం ఆ వ్యసనాలకు దాసులై, సమర్థతను కోల్పోయి, నిర్వీర్యులుగా తయారై జిల్లా వదలి పెట్టారు. ఇటువంటి వారందరికీ బాబు దుర్మరణం ఒక హెచ్చరిక!

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### పెంచలుకోనకు పోవద్దు కలరా వుంది

చుట్టు ప్రక్కల కలరా వుంది. గాన పెంచెలు కోన తిరునాళ్లకు పోవద్దనియు, అథవా విధిలేక పొయ్యే యెడల నెల్లూరు, పొదలకూరు, దామూరు, కలువాయి ఆస్పత్రులలో సూది మందు వేసుకొని పోవలెననియు, హెల్తు ఆఫీసరు గారు హెచ్చరిస్తున్నారు.

# పంచాంగము

తేది 11 మంగళవారము నిజకర్తరి ప్రారంభము

### ముహూర్తములు

తేది 9 ఆదివారము ఉదయము 9 గంటలకు మిధున లగ్నమున వివాహ ఉపనయన వ్యాపారారంభ శేశ ఖండనములకు సుముహూర్తము కలదు

### మే నెల తిథులు

వైశాఖ బహుళ

తే 8 శని విదియ ఉ.గ. 6.25 వ
తరువాత తదియ పూర్తిగ
తే 9 ఆది చతుర్థి రా.గ. 4.40 వ
తే 10 సోమ పంచమి రా.గ.4.44 వ
తే 11 మంగళ షష్టిరా.గ. 5.17 వ
తే 12 బుధ సప్తమి పూర్తిగ
తే 13 గురు సప్తమి ఉ.గ. 6.20 వ
తే 14 శుక్ర అష్టమి ఉ.గ. 7.45 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

### నెల్లూరులో ఎండ

| | |
|---|---|
| 1 తేదీ | 107.6 |
| 2 తేదీ | 108.9 |
| 3 తేదీ | 105.0 |
| 4 తేదీ | 107.6 |
| 5 తేదీ | 106.1 |
| 6 తేదీ | 105.4 |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 9.0 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 2.7 అ |
| నెల్లూరు చెరువు | 12.0 అ |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (పాతవి) | 3,600/- |
| 9672 (కొత్తవి) | 3,100/- |
| 9674 (పాతవి) | 3,800/- |
| 9674 (కొత్తవి) | 3,200/- |
| ఐ.ఆర్. 20 | 2,600/- |
| బియ్యం (70 కిజీలు) | 540/- |
| బియ్యం 1 కేజీ | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,360/- |
| వెండి (10 గ్రా) | 63/- |
| పెసలు (100 కిలోలు) | 960/- |
| వేరు శెనగ నూనె (కిజీ) | 24/- |
| మిరప కాయలు (కిజీ) | 20/- |
| చింతపండు (కిజీ) | 19/- |

# ఇద్దరు పెళ్లాల చిత్రాల పై కేసు

బహు భార్యాత్వాన్ని ప్రోత్సహించే చిత్రాలను ఆమోదించ కూడదని సెన్సార్ బోర్డ్ నిబంధనల్లో ఉంది. అది వరకు "మంచి కుటుంబం. నారీ నారీ నడుమ మురారి" అటీవల "ఏవండీ ఆవిడ వచ్చింది. రెండిళ్ల పూజారి" వంటి ఇద్దరు పెళ్లాల మొగుడు చిత్రాలు సెన్సార్ ఆమోదంతో విడుదలయ్యాయి! పై చివర పేర్కొన్న రెండు చిత్రాలకు అభ్యంతరం తెల్పుతూ ఎమ్.ఆర్. శంకు అనే న్యాయవాది పెట్టుకున్న రిట్ పిటిషన్‌ను ఏప్రిల్ 28 న జస్టిస్ గోపాల రావు స్వీకరించి ప్రతివాదులకు నోటీసులు జారీ చేశారు. తీర్పు ఎలా వుంటుందోనని కొత్తగా బహు భార్యాత్వం కథలతో చిత్రాలు తీస్తున్న ఇద్దరు నిర్మాతలు గాబరా పడిపోతున్నారు. మొత్తం మీద సెన్సార్ నిబంధనలకు విరుద్ధంగా బహుభార్యాత్వం కథాంశాలుగా గల చిత్రాలకు ఎలా సర్టిఫికెట్లు ఇవ్వబడ్డాయన్నది చాలా మందికి కొరుకుడు పడని సమస్య.

## 'ఆత్రేయ మనస్విని' అవార్డు వేటూరికి

వేటూరి మా కోవలోకి చెందిన వాడని ఆచార్య ఆత్రేయ తరచు అంటుండే వారు. వేటూరికి కూడా ఆత్రేయ అంటే ఎంతో గౌరవం. "ఆత్రేయ ప్రేమ గీతంగా" అని ఆయన ఓ పాటలో ప్రయోగించారు కూడా. సుందర కాండ చిత్రంలో "ఆకాశంలో సూర్యుడుండడు సందవేళకి" అనే గీతానికి 1992 ఉత్తమ గీత రచయితగా వేటూరి సుందర రామమూర్తికి ప్రతిష్ఠాత్మకమైన 'ఆత్రేయ మనస్విని' అవార్డును ఇస్తున్నట్లు ఆ సమితి తరఫున కొంగర జగ్గయ్య తెలిపారు.

## సినిమా

### బిజీ అవుతున్న పి.సి.రెడ్డి

రమేష్ బాబు, రాజ్‌కుమార్, ఆమని, సౌందర్య నటించే 'అన్నా చెల్లెలు' చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్న సీనియర్ దర్శకుడు పి. చంద్రశేఖర రెడ్డి త్వరలో జయప్రద నాయికగా అనూరాధ ఫిలిమ్స్ చిత్రానికి, ఆగస్టు నుంచి సురేష్ హీరోగా లక్ష్మీ కంబైన్స్ "పెద్ద కొడుకు" చిత్రానికి దర్శకత్వం వహించనున్నారు.

### కోదండ రామిరెడ్డి దర్శకత్వంలో నాగార్జున

"విక్కీదాదా" అనంతరం నాగార్జునతో కామాక్షి ఆర్ట్ మూవీస్ అధినేత డి. శివప్రసాద్ రెడ్డి మే 1 నుంచి నిర్మించే వినోదాత్మక చిత్రంలో మీనా, నగ్మా, వాణిశ్రీ, రావు గోపాల రావు, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, బాబూమోహన్ ప్రభృతులు నటవర్గం.

# తారల ఆస్తుల జప్తు

దాదాపు తారలందరూ స్వీకరించేది నల్ల ధనమే. లెక్కలలో చూపించే పారితోషికాల మొత్తం అతి స్వల్పం. ఈ విషయం సామాన్య మానవుడికి తెలుసు. ఐతే, ఆదాయపు పన్ను శాఖ వారికి వాళ్ల పన్ను చెల్లించటంలో ఎందుకు నిర్లక్ష్యం వహిస్తారో ఓ పట్టాన బోధపడదు. కొంత మంది తారలు తమ శాఖకు ఎంతెంత మొత్తం ఎగ్గొట్టారో ఆ బకాయిలను ఆదాయపు పన్ను శాఖ తరచు ప్రకటిస్తూ వచ్చింది. ఇక ఆ మొత్తాలను పద్ధతిలో వసూలు చేయడానికి తీవ్రమైన చర్యలు తీసుకో బోతున్నది. వారి ఆస్తిపాస్తులను జప్తు చేసేందుకు సైతం వెనుకంజ వేయబోయేది లేదని ఆ శాఖ అధిపల స్పష్టంగా తెలియజేసింది. ఆ శాఖ బ్లాక్ లిస్టులో ఉన్న తారలు వీరు– రాజ్‌కపూర్, ప్రేమ్ నజీర్, అమ్జాద్ ఖాన్, వగైరా దిగ్గజములు గాక ఎన్టీ రామారావు, బాలకృష్ణ, కమలహాసన్, రజనీకాంత్, భాగ్యరాజ్, టి. రాజేందర్, శ్రీదేవి, రేఖ, శారద, రాధిక, సుహాసిని, జయప్రద, రాజేష్ ఖన్నా, బిశ్వజిత్, రాజ్‌బబ్బర్, శత్రుఘ్నసిన్హా, శక్తికపూర్, నసీరుద్దీన్‌షా, షబ్నా ఆజ్మీ, టీనా మునిమ్, రతి, మాధవి, డింపుల్ కపాడియా, రీనారాయ్, సైరాభాను.

## "లోటస్ చాక్లెట్" గురించి ఊర్వశి శారద

ఆరు వేల టన్నుల సామర్థ్యం గల గల తమ లోటస్ చాక్లెట్ కంపెనీ ఉత్పత్తులలో సగ భాగాన్ని విదేశాలలో, మిగతా సగాన్ని స్థానికంగా అమ్మడానికి ఏర్పాట్లు పూర్తయినట్లు ఆ సంస్థ ప్రమోటర్ 'ఊర్వశి' శారద, మేనేజింగ్ డైరక్టరయిన ఆమె భర్త విజయ రాఘవ నంబియార్ తెలిపారు. మధుమేహం ఉన్న వారు సైతం తీసుకో గల ఈ విశిష్టమైన చాక్లెట్‌లను (పాన్ వంటి) డబ్బాల ద్వారా విక్రయించాలన్నది తమ ఆలోచన అని చెప్తూ ఏటా 100 కోట్లకు పైగా వ్యాపారం చేయగలమన్న ఆశాభావాన్ని ఇద్దరూ వ్యక్తపరిచారు.

*

## పీడితుడి తిరుగుబాటుకు 'రథసారథి' నియంతుల బాధితుడే

### చిత్రసమీక్ష

***

గ్రిద్దలూరు గోపాలరావు

శ్రీ కృష్ణుడు దండం చేతబట్టి తోలేస్యందనంలో అర్జునుడు నిలబడి నారిసారిస్తూ దుర్మార్గపు మూకను చెండాడుతారు. అంటే ధర్మ సంస్థాపన కోసం శ్రీ కృష్ణుడు రథ సారథై పార్థునికి గీతా బోధ చేసి అతని చేత అధర్మాన్ని హతమార్పిస్తారు. ఇది కురుక్షేత్ర రణరంగం. ఈ రణరంగానికి కారణం పాపం పెరగటం, పాపం పండటం.

ద్వాపరయుగంలో లాగే ఈ కలియుగంలోనూ పాపం పెరుగుతూ వుంది. పండ వలసి వుంది. పాపం పండగానే "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" - ధర్మం నిలబెట్టేందుకు ప్రతి యుగంలో లాగా ఈ కలియుగంలోనూ భగవంతుడు మానవ రూపంలో అవతరిస్తాడు. సాధు సజ్జనులను రక్షిస్తాడు. దుర్మార్గులను హతమారుస్తాడు. ఈ మూలం మీద శరత్ దర్శకత్వంలో రూపొందిన "రథసారథి" చిత్రం సాగుతుంది.

ఈనాటి రాజకీయ దురంహంకారానికి అధికార దురవస్త్రకు, పీడిత ప్రజ ప్రాణాంతకానికి నిలువుటద్దంలా నిలుస్తుంది ఈ చిత్రం. ఈనాటి రాజకీయ నాయకులు ఎక్కువ భాగం పశుత్వానికి ప్రథమ వారసులుగా వ్యవహరిస్తున్నారు. అవినీతిని శ్వాసిస్తూ రాక్షస గర్వంలో విలయ తాండవం చేస్తున్నారు. స్వార్థం కోటి శిరస్సులు విప్పి బుస కొడ్తూ వుంది. ఆ కారణంగా దేశం నరాంతక నియంతలతో అనాగరిక మృగారణ్యమైంది. మృగ నాగరికత

కొరవ 10 పేజీలో



జె.కె. కుమారుడి వివాహ మహోత్సవానికి నయనానందకరంగా తీర్చి దిద్దబడిన కుసుమ శోభిత స్వాగత ద్వారం; వరుడు రామ మోహన్, వధువు విసుజ; వివాహానికి హాజరైన మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్ధన రెడ్డి, మంత్రులు సమర సింహారెడ్డి, మైసూరారెడ్డి మధ్యలో జె.కె. రెడ్డి

# కోర్టుల్లో పెండింగ్ కేసులకు న్యాయమూర్తులూ కారకులే!

నెల్లూరు పట్టణ న్యాయవాద సంఘ వార్షికోత్సవం 2 తేది సాయంత్రం జిల్లా కోర్ట్ సముదాయాన ఆత్మీయత, అనురాగ పూర్వక వాతావరణంలో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభలో ముఖ్య అతిథిగా విచ్చేసిన హై కోర్ట్ న్యాయమూర్తి శ్రీ ఇమ్మానేని పాండురంగ రావు ప్రసంగిస్తూ కేసుల విచారణ, పెండింగ్ కేసుల విచారణకు న్యాయవాదులతోపాటు, న్యాయమూర్తులు కూడా బాధ్యులన్నారు. కోర్టుకు దాఖలు చేసే పలు కేసుల్లో లోటు పాట్లున్నా వాటికి న్యాయమూర్తులు నెంబర్లు ఇవ్వడంతో విచారణ సమయంలో డాక్యుమెంట్లు, సాక్షుల పేర్లు కరువై నిలిచి పోతున్నాయి. వీటిని ముందుగానే త్రోసి పుచ్చితే బాగుంటుందన్న అభిప్రాయాన్ని వ్యక్త పరిచారు.

జిల్లాలోని అన్ని కోర్టుల న్యాయవాదులూ హాజరైన ఈ వార్షికోత్సవ సభను జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ పర్యవేక్షించగా బార్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ సుందరాచారి సభను అధ్యక్షించారు. చాలా కాలం నుండి వృత్తిలో కొనసాగుతున్న న్యాయవాదులు శ్రీ యుతులు ఎస్.ఎస్. కృష్ణమూర్తి, ఆచార్య పి.సి. రెడ్డి, ఎం. సుందరాచారి, ఎం.ఎం. రావు, పి.వి. రమణారెడ్డి, పి. రాఘయ్య, టి. రామమూర్తి, కావలి సుబ్బరామయ్య, ఎస్. రంగనాధం, పి. శేషాచలం, ఎస్. పాండురంగా రావు, టి. సుందర రామిరెడ్డి, ఎం. కృష్ణారెడ్డి, పి. అనంతరామయ్య, సి.పి. రావులను సన్మానించారు. మహిళా న్యాయవాది జె. స్వరాజ్యలక్ష్మి ప్రార్థనా గీతంతో సభ ప్రారంభం కాగా చివరన జరిగిన చింతా సుబ్బలక్ష్మి కర్ణాటక సంగీతం కచ్చేరి వలువుర్ని అలరించింది. ఆటల పోటీలో గెలుపొందిన వారికి జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ బహుమతులందజేశారు.

## ఆంధ్రా బ్యాంకు మహాసభ

ఆంధ్రా బ్యాంకు అవార్డ్ ఎంప్లాయిస్ యూనియన్ మహాసభ 2 తేది కస్తూర్బా కళాక్షేత్రంలో ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభలో ఆలిండియా బ్యాంక్ ఎంప్లాయిస్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి తారకేశ్వరి చక్రవర్తి మాట్లాడుతూ బడా పారిశ్రామిక వేత్తలు, రాజకీయ నాయకుల వల్ల బ్యాంకులు దివాళా తీయగా దాన్ని సాకుగా చూపించి ప్రభుత్వం బ్యాంకులను ప్రైవేటీకరణ చేస్తాననడాన్ని విమర్శించారు. సభకు ఆంధ్రా బ్యాంక్ జనరల్ మేనేజర్ సి.హెచ్. రాజారావు ముఖ్య అతిథిగా విచ్చేశారు. అనంతరం జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా వి. కిషోర్ కుమార్, ప్రధాన కార్యదర్శిగా జి.ఎస్.ఆర్. మోహన్ రెడ్డి, కార్యదర్శిగా టి. రవీంద్ర నాథ్ ఎన్నికయ్యారు. కార్యక్రమంలో ఎ.పి.బి.ఇ.ఎస్. కార్యదర్శి ఎస్. సంపత్, పి. వాగేశ్వర రావు, జి.జి.కె. మణి తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరు సంగతులు

### నెల్లూరులో సౌందర్య లహరి సప్తాహం

శ్రీ రామకృష్ణ సేవా సమితి టౌన్ హాల్లో ఏర్పాటు చేసిన సౌందర్య లహరి సప్తాహాన్ని శ్రీ కృష్ణ దేవరాయ యూనివర్శిటీ కాలేజి ప్రిన్సిపాల్ డాక్టర్ ఎం. ఎల్. కాంతారావు 3తేది

కొరవ 8 పేజీలో

## చిత్రసమీక్ష

(9వపేజీకొరవ)

నిండిన జనారణ్యంగా మారింది. ఈ అమానుషత్వం రాజశేఖర్ (అక్కినేని) అనే ఐ.ఎ.యస్. కలెక్టర్ ధర్మపాలనను చివుక్కు మని పించింది. తన సంకల్పబలంతో, సాహస ధనంతో దోపిడీ చరిత్రను పరిసమాప్తం చెయ్యాలనుకుంటాడు. పీడితుడిలోని పిరికి తనాన్ని పారద్రోల ప్రయత్నిస్తాడు. అధర్మం మీద తిరగబడే వరకు వాడిని పురికొల్పాలను కుంటాడు. బ్రతుకంటే యుద్ధభూమి కాదు, స్వర్గసీమ అని రుజువు చెయ్యాలను కుంటాడు. సగటు మానవుడు సామ్రాజ్యాధినేత అయితేనే ఇది సాధ్యమని భావిస్తాడు. అందుకే కలెక్టరుగా వున్న రాజశేఖరం తన ఉద్యోగానికి రాజీనామా చేసి కురుక్షేత్రం రణరంగానికి రథ సారధ్యం వహిస్తాడు. సారధి (వినోద్ కుమార్) అనే నిరుద్యోగిని అర్జునునిగా ఉపయోగించు కుంటాడు.

ఆ ఊళ్లో బాపినీడు (సత్యనారాయణ) అనే నియంత వుంటాడు. అతని ఇద్దరు కొడుకులూ, రామినీడు, అంకినీడు కూడా తండ్రిని మించిన తనయులు. వీరికి మంత్రి (కోట శ్రీనివాస రావు) అండ దండలు దండిగా వుంటాయి. పేద వాళ్ల గుడిశెలు పీకించి అక్కడ విలాస వంతమైన హోటలు నిర్మిస్తారు. రాజశేఖరం కూతుర్ని మానభంగం చేసి చంపేస్తారు. రాజశేఖరాన్ని గూడా చంపే ప్రయత్నం చేస్తారు. జిల్లా యస్.పి.ని "ఏంరా ఎందుకొచ్చావు" - అని సంబోధించే దురహంకారం ఆ బాపినీడుది. వారి పాపం పండటంతో రథసారధి రంగం లోకి దిగటం, ఒక పథకం ప్రకారం సారధిచేత దుష్ట చతుష్టయాన్ని అంత మొందించటం జరుగుతుంది.

చిత్రం తాలూకు కథ, కొమ్మనాపల్లి గణపతిరావు వ్రాసింది చాలా పాతది. ఇది వరకు వచ్చిన ఎన్నో సినిమాల్లోని ఇతివృత్తమే ఇందులోనూ కనిపిస్తుంది. ఈ పాత దనానికి దర్శకుడు తన మేధాశక్తితో కొత్త దనం కల్పించి ప్రాణం పోశాడు. పాత కథకు దర్శకుడు అతికించిన హంగులు, పొంగులు ఆకర్షణీయంగా వున్నాయి. రేఖ (రవీనా టాండన్) అనే నాజూకు అమ్మాయిని చాలీ చాలని దుస్తుల్లో చూపి శృంగారాన్ని, అల్లు రామలింగయ్య, బాబూమోహన్, సూర్యకాంతం ద్వారా హాస్యాన్ని సృష్టించి వినోదాత్మకంగా చూపాడు దర్శకుడు. వినోదం కల్పించటంలో ప్రజాదరణ పొందుతుంది చిత్రం.

ఈ చిత్రానికి ముఖ్యమైన ఆకర్షణ రాజశేఖరం పాత్ర. ఆ పాత్రలో నటించిన అక్కినేని నాగేశ్వర రావు హుందాతో కూడుకున్న పాత్రకు తన నటనతో మరింత హుందా తనం కూర్చాడు. వినోద్ కుమార్ డబ్బింగ్ సరిగ్గా అమరలేదు. బాగానే నటించాడు. సత్యనారాయణ విలనీయంలో మంచి బలం వుంది. కోట శ్రీనివాస రావుకు మంత్రి వంటి పాత్రలు కొట్టిన పిండి.

పరుచూరి బ్రదర్స్ మాటల్లో చురుకైనవి కొన్ని చోట్ల వినిపిస్తాయి. వేటూరి, భువన చంద్ర వ్రాసిన పాటల్లో "మేఘమా ప్రియ స్వాగతం" పాట రాజ్-కోటి సంగీతంలో కమ్మగా వుంది. సుధాకర్ రెడ్డి కెమరా ఈ పాట దృశ్యాన్ని అందంగా చూపింది.

## స ఖు గు డు

### * హెచ్.కె. బాబు దురదృష్టకర జీవితం అధికారులందరికీ హెచ్చరిక కావాలి!

హెచ్కె బాబు అన్యాయంగా చనిపోయాడు; అనవసరంగా చని పోయాడు. రాష్ట్ర ప్రభుత్వం ఒక సమర్థుడైన ఐఎఎస్ అధికారిని కోల్పోయింది. హెచ్.కె. బాబు అవినీతి పరుడనే భావం వుండవచ్చు; దుర్వ్యసన పరుడు కావచ్చు; ఆశ్రిత పక్షపాతి అయివుండవచ్చు; తనకు గిట్టని వారిపై కత్తిపట్టి, తను మెచ్చే వారి కోసం కలం



పట్టి అధికారం దుర్వినియోగం చేసి వుండవచ్చు. అన్ని అవలక్షణాలూ మూర్తీభవించిన వాడై వుండవచ్చు. కాని అతనొక సమర్థుడైన అధికారి; గొడ్డు చాకిరి చేసే కష్టజీవి; చట్టాలను ఔపోసన పట్టిన వ్యక్తి. ఉన్నతాసనాలలో వుండే అధికారులు సమర్థులైతే సమాజానికి ఎంత ఉపయోగ పడతారో నిరూపించ వలసిన వాడు కాస్త, ఉన్నత స్థానాలలోని అధికారులు మానసిక దౌర్బల్యులైతే సమాజాన్ని ఎంత కలుషితం చేస్తారో చెప్పుకోవడానికి ఒక ఉదాహరణగా మారి, మృత్యుకబళి తుడైనాడు. ఎందువల్ల ఈ విపరిణామం? ఎవరు దీనికి కారకులు? చెడిపోయిన వ్యక్తిని నిరసించే ముందు, ఆ చెరుపుకు ప్రేరేపించిన వారినీ ఈసడించాల్సిన అవసరం వుంటదా?

బాబు స్వతహాగా నీచ స్వభావి కాదు; డిఆర్‌ఓగా అతనెంత సమర్థంగా వ్యవహరించింది, ఎంత టెర్రర్ సృష్టించిందీ నెల్లూరీయులకు తెలుసు; తర్వాత తర్వాత ఆ తరహాకు అతను మారి పోయాడు; మార్చబడ్డాడన్నా సమంజసమే! మారిన బాబునూ, కలెక్టర్‌గా మనం చూశాం, అనుభవించాం కూడా! ఈ రెండు రూపాల మధ్య ఏమి జరిగింది; ఎందుకు జరిగింది; ఎవరు జరిపించారు?

తమ పనులు నెరవేర్చు కోవడానికి, తమ పబ్బం గడుపుకోవడానికి, తమ పరపతి పెంచుకోవడానికి, తమ దాబు ప్రదర్శించడానికి కొందరు రాజకీయ వాదులు, కొందరు నియోరిచ్ వ్యాపారులు పన్నిన వలలో ఇరుక్కు పోవడమే బాబులో వచ్చిన రూప పరిణామం! మనిషన్న ప్రతివాడికి కొన్ని బలహీనతలుంటాయి. ఇంద్రియ నిగ్రహంతో వాటిని నిగ్రహించుకునే వారు కొందరైతే, పిరికితనంతో చెడిపోకుండా బయటపడే వారు ఇంకొందరు. ఈ రెండూ లేని వారిపై, రంగుల వల విసిరితే బోల్తా పడిపోతారు. యముడికి శివుడికి వెరవని వాడిగా, అవినీతి గివినీతులను దరిచేర నివ్వని వాడుగా, ఎంతటి వాడినైనా ధిక్కరించి, తాననుకున్న పని చెయగల్గిన వాడుగా వుండిన బాబును నెల్లూరు వ్యాపారులే కొందరు నైస్‌గా మచ్చిక చేశారు.

#### డోలేంద్ర

తళతళలాడే "రెండువేల" కార్లలో షికార్లు త్రిప్పి, నిగనిగలాడే యవ్వన సౌందర్యాలను కళ్ల ముందు మెరిపించారు; ఫారిన్ విస్కీల రుచి మరిపారు; మద్రాసు ఫైవ్‌స్టార్ హోటళ్లలో ఖుషీ చేశారు; మనిషిని ఎంతగా పతనం చేయవచ్చో అంతా చేశారు. ఆ మత్తులో, ఆ మైకంలో బంగారం వంటి అధికారి కాస్త మైనం ముద్ద వలె మెత్తబడిపోయారు; ఎవరెటు త్రిప్పితే అటు తిరిగారు. కాంట్రాక్టర్లు, విస్కీ వ్యాపారులు, రాజకీయ వాదులు అతడితో ఆటలాడుకున్నారు. సహజంగా ఉద్రేకి, ఆవేశపరుడు, చంచల స్వభావి అయిన బాబులో ఒకసారి పతనం ఆరంభమైన తర్వాత, అడుగుకు అంచే లేకుండా పోయింది; అంతు తెలియని అగాధంలోకి దిగజారుడు జరిగిపోయింది. ఆ కాంట్రాక్టర్లు, ఆ విస్కీ సంపన్నులు మాత్రం క్షేమంగా వున్నారు; బాబు మాత్రం అత్యంత హేయమైన, నీచమైన ఆరోపణలతో అగుడు పట్టి, అదృశ్యమై పోయాడు.

కొరవ 8 పేజీలో

## సంగీతం తెలియని వారికీ త్యాగరాజ కీర్తనల సారం సుబోధకం చేసిన

# త్యాగరాజు రామకథాసుధ

ఈ గ్రంథమును వ్రాసిన శ్రీ జలపాపులూరి కామేశ్వర రావు ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, సంస్కృత భాషలలో పండితుడు. అంతే గాక ఆయన ఉత్తమ శ్రేణికి చెందిన గాయకుడు. ఐందు పెందు మూడు దశాబ్దాల పాటు నిరంతరం శ్రీ త్యాగరాజ కీర్తన క్షీర సాగరాన్ని మథించి వెలువరించిన అమృతాన్ని వీరు తమ సంగీత వ్యాసాల ద్వారా, ఆంధ్ర తమిళ నాడులలోని సంగీత సాహిత్య పిపాసువులకు పంచి పెడుతున్నారు. శ్రీ త్యాగరాజ గానామృతానికి సంబంధించి వీరు ప్రచురించిన గ్రంథ శృంఖలలలో ఇది రెండవది. ఇది వరకే వీరు ప్రచురించిన "శ్రీ త్యాగరాజ పంచరత్న కీర్తనలు" అన్న గ్రంథం తద్జ్ఞుల మన్ననలను అందుకొన్నది.

వాల్మీకి రామాయణం పాఠ్యగేయిత మధురమ్ అన్న ప్రశస్తిని పొందగా శ్రీ త్యాగరాజ గానం చేసిన శ్రీ రామకథా సంబంధి కీర్తనల సమూహం గేయ పాఠ్యేచ మధురమ్ అనడానికి సంకోచింప పనిలేదు. శ్రీ త్యాగరాజ అసావేరి రాగంలో రచించిన 'ఏ పనికో జన్మించితినని నన్నెంచ వలదు శ్రీ రామ' అన్న కీర్తన చరణంలో 'వాల్మీకాది మునులు, నరులు నిన్ను వర్ణించిరి నాయా నరదునా' (పుట 55) అని తెల్పి శ్రీ

> **గ్రంథ సమీక్ష**
>
> **త్యాగరాజ రామ కథాసుధ**
>
> రచయిత
>
> **జలపావులూరి కామేశ్వర రావు**
>
> సమీక్ష కర్త
>
> **కె.పి. నారాయణ రావు**
>
> రిటైర్డ్ జిల్లా జడ్జి
>
> ప్రతులకు
>
> శ్రీ కామాక్షి నిలయము
> 27/366, గాయత్రి నగర్
> నెల్లూరు - 524 004.
>
> మూల్యం
>
> **రూ. 20/-**

రామచరితమును కీర్తన రూపంలో వెలయించడం తన జీవిత ధ్యేయమని సూచించారు. తదనుగుణంగా శ్రీ రామకథలోని ముఖ్యమైన ఘట్టాలను శ్రీ రామ జననం నుండి పట్టాభిషేక పర్యంతం వర్ణిస్తూ అనేక కీర్తనల వ్రాశారు. ఆ కీర్తనలన సముదాయాన్నే గ్రంథ రచయిత రామకథా సుధగా పేర్కొన్నారు. శ్రీ త్యాగరాజ వ్రాసిన ఈ కీర్తనలన్నీ కూడా చాలా వరకు వాల్మీకి రామాయణాన్ని అనుసరించి ఉన్నాయని చెప్పవచ్చు. ఒకటి రెండు కీర్తనలు– ఉదాహరణకు దీపక రాగంలో రచించ బడిన "కలల నేర్చిన" అన్న కీర్తనలో ప్రస్తావించ బడిన శృంగరముని వృత్తాంతము వంటివి తప్ప చాలా వరకు అవాల్మీకాలైన సంఘటనలను శ్రీ త్యాగరాజ స్పృశించలేదు. ఈ గ్రంథ రచయిత శ్రీ త్యాగరాజ కీర్తనలతో బాటు సమానాంతరం గాను, తులనాత్మకంగాను వాల్మీకి రామాయణము నుండి సందర్భోచిత శ్లోకాలను ఉదహరించడం ఈ గ్రంథానికి ప్రామాణ్యాన్ని చేకూర్చింది.

ఉదాహృత కీర్తనలను శ్లోకాలను ఏక సూత్ర బద్ధం చేస్తూ రచయిత అనుసంధించిన వ్యాఖ్యానం ప్రశంసనీయంగా ఉన్నది. సంగీతం తెలియని వారు కూడా ఈ గ్రంథాన్ని చదివి నట్లైతే శ్రీ రామకథను త్యాగరాజ, వాల్మీకి ఏ దృష్టితో వర్ణించారో తెలుసుకోగలరు.

కొన్ని కీర్తనలకు ఈ గ్రంథ రచయిత చెప్పిన అర్థం మౌలికంగా ఉన్నది. ఉదాహరణకు "వెడలెను కోదండపాణి" అన్న కీర్తనలో 'వసుధ భారమెల్ల దీర్చ' అన్న మాటలకు 'భూదేవి కూతురు సీత. సీతమ్మ జానకిగా మిథిలలో పెరుగుతున్నది. ఆమెకు తగిన వరుడు దొరికితే తల్లికి నెత్తి మీద భారం తీరుతుంది'( పుట 12) అని చెప్పడం యుక్తియుక్తంగా ఉన్నది. 'కంట జూడుమీ' అన్న వాచస్పతి రాగ కీర్తనలో తనకు పరిచర్య చేస్తున్న లక్ష్మణుని గూర్చి శ్రీరాముడు సీతతో ఏదో చెప్ప బోగా చూచిన లక్ష్మణుడు పులకాంకితుడు అవడం శ్రీ త్యాగ రాజ ఊహించిన సన్నివేశమని ఈ గ్రంథ కర్త వివరించడం బాగున్నది ( పుట 24) వివర్ధని రాగ కీర్తన 'మనసా! మన సామర్థ్యమేమి?' చరణంలోని 'పలు మారు జగమ్ములు కల్ల లనిన రవిజుని మాయ వల వేసి త్యాగరాజ వరదుడు కాచనగ లేదా?' అన్న వాక్యం లోని 'రవిజుడు' అన్న పదానికి దశరథుడు అని అర్థమని ఈ గ్రంథ రచయిత వివరించడం ఆ పదానికి సుగ్రీవుడని కొన్ని పూర్వ వ్యాఖ్యలు చెప్పిన అర్థం కన్నా సంతృప్తికరంగా ఉన్నది.

త్యాగరాజ రచించిన "సీతారామ విజయ" మనే యక్షగానం ఉత్తర కాండ కథకు సంబంధించినది. అందలి కీర్తనల సాహిత్యమును మాత్రం లోకా నారాయణ శాస్త్రులు అన్న ఆయన మద్రాసు నుండి 1868 లో ప్రకటించినారట. ఆ యక్షగానం ప్రతి ఒక్కటి కూడా ఇప్పుడు లభ్యం కావడం లేదు. శ్రీ కామేశ్వర రావు సంకలనం చేసిన ఈ రామకథాసుధ ఆ లోపాన్ని కొంత వరకు తొలగించి సంతృప్తిని కలిగిస్తుందన దానికి సందేహం లేదు. ఇందుకు శ్రీ కామేశ్వర రావు అభినందనీయులు.

కాని గ్రంథంలో అచ్చు తప్పులు చాలా ఎక్కువగా ఉన్నవి. కంటిలోని నలుసు, కాలి ముల్లు లాగా అవి చాలా బాధాకరంగా ఉన్నవి.

స్వయంగా మంచి కవి, విద్వద్విమర్శకుడు సాహిత్య పోషకుడు, వదాన్యుడు అయిన శ్రీ వాకాటి పెంచలు రెడ్డి గారు ఈ గ్రంథ ప్రచురణ భారాన్ని స్వీకరించి పరిత్ర లోకాన్ని కృతజ్ఞతా బద్ధం చేశారు. ఆయనను తప్పక అభినందించ వలసి ఉన్నది.



## పినాకినీ తీరం

(2 పేజీ కొరవ)

కాంగ్రెస్ వైపుకు మారుతున్నట్లున్నారు. వీరిలో వస్తున్న ఈ మార్పు చిత్తశుద్ధితో కూడిందా? వీరు నిజంగానే మారినా, వీరి అనుయాయులలో ఎందరు మారుతారు? గ్రామాల్లో ముఖ్యుల మీద ఆధారపడడం, అంతా వారి మీద వదలి అనుకూలంగా వుందనుకోవడం కాలం దీరిన పద్ధతి. ఈ విషయంలో 1978 తర్వాత తల్లక్రిందుల మార్పు వచ్చింది. 18 ఏళ్ల యువకులకు ఓటు హక్కు కల్గించిన తర్వాత ఈ మార్పు మరీ ఎక్కువైంది. ఆ తర్వాత ఎవరి చేతిలోను ఎవరూ లేరు. ఎవరికి వారు స్వతంత్రులు. దీని ప్రకారమైతే ప్రస్తుతం ముఖ్యులలో ఒత్తిడులతో తెబడుతున్న మార్పు కాంగ్రెస్‌ను పెద్ద లాభకారి అనుకోలేము. కాని హరిజన, గిరిజనాది బలహీన వర్గాల వారిలో, ఇతర సామాన్యులలో మాగుంట వారి మీద మోజు వున్నదంటున్నారు. ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో సుబ్బరామ రెడ్డి గారు ఎన్నో ప్రజోపయోగ కార్యాలు చేస్తున్నారని, ఇప్పుడు ఆయన చెప్పినట్లు కాంగ్రెస్‌కు ఓటు వేస్తే, తమకు మేలు జరుగుతుందనే ఆశాభావం బలహీన వర్గాల వారిలో వున్నదని, అందువల్ల కాంగ్రెస్ అనుకూలత పెరిగిందని చెప్తున్నారు. ఇది వాస్తవమైతే కాంగ్రెస్‌కు శుభసూచనే.

అయితే విజ్ఞులు కొందరు ఒక 'పరా' ప్రతిపాదిస్తున్నారు – మాగుంట వారి ప్రయాస సరేననుకోండి, వ్యయం పరహస్తాల పాల్గాకుండా సద్వినియోగమైతే – అనేది ఆ పరా. ఇది త్రోసి వేయ తగింది కాదు!

వేపూరు దేవకుమార రెడ్డి కాంగ్రెస్‌కు వేయడం లేదని ఒక ప్రచారం. అన్యాయపు దుష్ప్రచారం ఇది. తానే అభ్యర్థినని తిరిగి ప్రచారం చేసుకొని ఎంతో ఆశతో వుండిన దేవకుమార్ రెడ్డి నోటి వద్దకు వచ్చిన నేలపాలై తీవ్ర మనస్తాపానికి, అవమానానికి గురైన వ్యక్తి. మామూలు పరిస్థితుల్లో అయితే వ్యతిరేకం చేయక పోయినా మొహం తప్పించి వుండవలసిన వాడు. అటు వ్యక్తి ప్రత్యేక పరిస్థితుల్లో, జనార్దన రెడ్డి ప్రతిష్ఠ కోసం, చిత్తశుద్ధితో చేస్తుంటే అపవాదులు వేసి నిరుత్సాహ పరచడం భావ్యం కాదు.

1989 కాంగ్రెస్ వాది అయిన తన తండ్రికి టికెట్ యివ్వకుండా, అవకాశ వాదంగా తెలుగుదేశం నుండి కాంగ్రెస్‌లో దూరిన నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డికి యిచ్చారనే కినుకతో చెరువు మీద అలిగి నట్లు తాను తెలుగుదేశంలోకి పోయిన పెళ్లకూరు ప్రభాకర రెడ్డి రెడ్డి, ఇప్పుడు తనకు కాకుండా తెలుగుదేశం టికెట్ కాంగ్రెస్ వాది శ్రీనివాసులు రెడ్డి కుమారుడైన ప్రసన్నకుమార్ రెడ్డికి యిచ్చారనే కోపంతో కాంగ్రెస్‌లో పున్ర ప్రవేశం చేశాడు. కాకతాళీయంగా ఈసారి కాంగ్రెస్ అభ్యర్థి ఆయన తండ్రి రామచంద్రా రెడ్డి గారే అయ్యారు. ప్రభాకర రెడ్డి ఆయనకు ప్రచారం చేస్తున్నాడు. శ్రీనివాసులు రెడ్డిది అవకాశ వాదమే; ఆయన అవకాశవాదే. కాని తాను చేసిన పని దేని క్రిందకు వస్తుంది. తననేమంటారు అనే స్పృహ ప్రభాకర్ రెడ్డిలో లేకుండా పోయింది. నాలుగేళ్ల పాటు సహనం వహించి నిలకడ ఒక పార్టీలో వుండలేని వారికి రాజకీయ భవిష్యత్ వుంటదు. ఈ సమయంలో ప్రభాకర రెడ్డి పార్టీ మారడం శోచనీయం!

ఇటీవల కాంగ్రెస్ యువకుల్లో జిందాబాద్ జాడ్యం ఒకటి వ్యాపించి పోయి వుంది. పూర్వం సేవా త్యాగాలతో దేశ సేవకు అంకితమైన మహా నాయకులకు మాత్రమే జేజేలు, జిందాబాద్‌లు పలికే వారు. ఆ అగ్రనాయకుని సరసన యితర నాయకులెందరున్నా, స్థానిక నాయకులెందరున్నా వారికి జిందాబాద్ లుండేవి కావు. ఇప్పుడు రాజకీయంగా పుట్టిన క్షణం నుండే పదవీ ఆరాట పోరాటాలకు అలవాటు పడి, సమయ సందర్భాలు, వుచితానుచితాలు పాటించ కుండా, పది మంది శిష్య గణాన్ని చేర్చుకొని చెవులు చిల్లులు పడేటట్లు జిందాబాద్‌లు కొట్టించుకుంటున్నారు. వినేవారికి, చూచే వారికి కూడా ఇది పరమ జుగుప్సాకరంగా వుంటున్నది. మన జిల్లా కాంగ్రెస్ వాదులలో ఈ జిందాబాద్‌ల సంస్కృతి 1979 ప్రాంతంలోనే ప్రారంభమైంది. ఎం.ఎల్.ఏ.లలో వుండిన ఆ జాడ్యం, అంటు వ్యాధిగా అందరికి వ్యాపించింది. కోవూరు ఎన్నిక సభల్లో ఈ కుర్రకారు జిందాబాద్‌లు పెద్ద కారుకు రుచించడం లేదు. 2 తేది కోవూరు మీటింగులో అంత మంది పెద్ద వారు వేదిక మీద వున్నప్పుడు, అసలు అభ్యర్థి పెళ్లకూరే వున్నప్పుడు, వారందరిని వదలి కొందరు యువకులు మాత్రం జేజేలు కొట్టించుకున్నారు. అరచిన వారికి, అరిపించుకున్నవారికి కూడా అసహ్యమనిపించలేదు. దురదృష్టం!

ఈ వుపాఖ్యానాలు వదిలితే – కోవూరు వుప ఎన్నికలో ఇంత వరకు కాంగ్రెస్ గెలుస్తుందని, గెల్చి తీరుతుందని ప్రచార ధోరణిలో, మేకపోతు గాంభీర్యంతో, ఆత్మవంచనతో చెప్పుకుంటుండిన కాంగ్రెస్ వాదులకు 'గెలుస్తాం' అని ఆత్మ విశ్వాసంతో చెప్పుకునే అవకాశం ఇప్పుడు కలిగింది. నామినేషన్ల నాటికి నేటికి వచ్చిన మార్పు ఇది!

NSR



# రావూస్ విద్యా సంస్థలు *

ఫోన్: 363, వెంకటాచలం
ఎక్స్చేంజ్
ఆఫీసు: 26046, 23781

## కోచింగ్ సెంటర్

ఏ.ఆర్.సి. ఎదురుగా, చాకలి వీధి, నెల్లూరు-1.

**గత 10 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున్న విద్యా సంస్థ**

### సీనియర్ ఇంటర్

M.P.C. & Bi.P.C. (T.M. & E.M.) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు మే 10 నుండి ప్రారంభం.

### జూనియర్ ఇంటర్

M.P.C. & Bi.P.C. (T.M. & E.M.) అడ్మిషన్లు ఏప్రెల్ 19నుండి జరుగును. క్లాసులు మే 17 నుండి ప్రారంభం.

గత సంవత్సరాల వలనే ప్రతి సబ్జెక్టులోనూ కనీసం 25 యూనిట్ పరీక్షలు నిర్వహించబడును. సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబర్ నుండి EAMCET కోచింగ్ ఇవ్వబడును.

NOTE : ముందుగానే అడ్మిషన్ తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.

## రెసిడెన్షియల్ హైస్కూల్ / రెసిడెన్షియల్ కాలేజి

G.N.T. రోడ్డు, బుజబుజ నెల్లూరు, వెముడుగుంట పోస్ట్, (బాలాజీ స్టీల్స్ సమీపంలో)

గత పది సంవత్సరాలుగా అఖండ ఫలితాలను సాధిస్తూ అజేయంగా అడుగులు ముందుకు వేస్తోంది రావూస్ సంస్థ. ఇప్పుడు ప్రారంభిస్తోన్న 'రావూస్ రెసిడెన్షియల్ హైస్కూల్ విద్యా లోకంలో సరికొత్త సూర్యోదయం.

1983 లో ఆరంభించిన 'రావూస్ కోచింగ్ సెంటర్' అనేక అనూహ్యమైన విద్యార్థుల విజయాలతో విజయ దుంధుభి మోగించింది. 1992లో బుజ బుజ నెల్లూరులో 'రావూస్ జూనియర్ కాలేజ్' గా రూపుదిద్దుకుని, తన స్థాయిని మరింతగా పెంచుకుంది. అదే ఉత్సాహంతో ఇప్పుడు కొత్తగా ఈ హైస్కూలుకు అంకురార్పణ పలికింది. విద్యార్థులు ప్రతిభా వంతులు కావాలంటే హైస్కూల్ స్థాయిలోనే బలమైన పునాదులు పడాలి. ఆ సదుద్దేశ్యంతోనే ఈ హైస్కూలు రూపకల్పన చేసుకుంది.

...న్స్ టెక్నాలజీతో 21-వ... ...రాబ్దంలోకి అడుగు పెట్టబోతున్న... బాల మేధవులకు స్వాగతం. స్టేట్... సిలబస్తో 6,7,8,9 మరియు 10వ తరగతులకు ఇంగ్లీషు మరియు తెలుగు మీడియంలలో అడ్మిషన్లు మే-1 తేది నుండి ప్రారంభం.



### మా ప్రత్యేకతలు

1. తక్కువ మంది విద్యార్థులు - ఎక్కువ శ్రద్ధ
2. వ్యక్తిగత పర్యవేక్షణ - క్రమ శిక్షణ
3. శుచి, శుభ్రత - రుచికరమైన భోజన వసతి
4. స్వతంత్ర ఆలోచనా ధోరణికి ప్రోత్సాహం.
5. జనరల్ నాలెడ్జి- స్పీడ్ టెస్ట్ - ఐ.క్యు టెస్ట్.
6. ప్రతిభా వంతులైన విద్యార్థులకు ఫీజుల్లో రాయితీలు
7. స్కాలర్ షిప్ సదుపాయం
8. బహుమతుల ప్రధానం
9. పరిశీలన పరిశోధన ప్రగతి
10. టేప్ స్కాలర్స్ కు ఐఐటి శిక్షణ.

అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్ లకు రూ.25/- M.O. & D.D. పంపి ఆఫీసునుండి పొందవచ్చును.

**రావూస్ కోచింగ్ సెంటర్**
17/584, రజక వీధి, నెల్లూరు -1
(ఫోన్స్ : 26046, 23781)

**అత్యుత్తమ శిక్షణ**
**అపూర్వ ఫలితాలు**
**ఆధునిక వసతులు**

జూనియర్ ఇంటర్ : M.P. & Bi.P. (T.M. & E.M.) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ.30/- M.O./D.D. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

సీనియర్ ఇంటర్ : క్లాసులు జూన్ 1 నుండి ప్రారంభం.

Note : ఇతర కాలేజీలలో జూనియర్ ఇంటర్ చదివి సీనియర్ ఇంటర్ మా కాలేజీలో చేరుటకు ప్రవేశము కలదు.

Note : ఇంటర్‌లో మెరిట్ స్కాలర్ షిప్ ఇవ్వబడును.

ఫీజు వివరములు : ఇంటర్, ఎంసెట్- మెటీరియల్‌తో సహా శిక్షణ, వసతి భోజనము పర్యవేక్షణలతో మొత్తం ఫీజు కేవలం రూ.15,000/- మాత్రమే. ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చును.

మెరిట్ విద్యార్థులకు రాయితీలు : 10వ తరగతిలో స్టేట్ ర్యాంకులో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం, వసతి ఉచితం.
500మార్కులు సాధించిన విద్యార్థులకు రూ.2000/-.
450 మార్కులు సాధించిన వారికి రూ.1,500/-
400 మార్కులు సాధించిన వారికి రూ.1000/-
ఫీజులో మినహాయింపులు ఉంటాయి

THE ZAMINRYOT WEEKLY - NELLORE

Edited. Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press. Nellore. OFFSET Printing at Nayagara Books (P) Ltd.